# Winning comes naturally, when you're on a Ladybird.




Embark on a word hunt and explore a priceless treasure of another kind. Discover a minimum of 30 words using the letters from the words LADYBIRD SPLASH, each word composed of at least 3 letters (e.g. bash), and send in your entries to us. The first 200 early bird entries stand a chance to win surprise gifts. Because on a Ladybird, every day is a new journey.

**BSA** LADYBIRD *Pink Splash*

*Your best friend for life.*

Fill in the details below and send your entries before 5th December 2008 to: The Brand Manager, TI Cycles of India, P.O. Box No. 5, MTH Road, Ambattur, Chennai - 600 053.

Name:________________ Address:________________

________________ Tel:________ Age:____ Date of Birth:________

School & Branch:________________ Class & Section:________________

Conditions Apply.

www.ticyclesindia.com

3

25% Off!

CHANDAMAMA'S

# Ramayana

An Epic Journey






Follow the epic journey of Prince Rama, from his birth to his exile, from the abduction of his wife, Sita, to his great war with the Asura King, Ravana, in Chandamama's latest offering: Ramayana - An Epic Journey.

**Price: Rs 450**

**Order now and get 25 % off!**

To place an order go to www.chandamama.com and click on the Pre-order button.

Chandamama's Ramayana is available only in English at all leading book shops.

చందమామ సంపుటి: 61 నవంబర్ 2008 సంచిక:11

## ఈ నెల విశేషాలు

















## ఈ సంచికలో ...





## అమరవాణి

ఇష్టమైన మాటలు చెప్పేవారు ఎందరైనా ఉంటారు. అప్రియమైన హితం చెప్పేవారూ, వినేవారూ దొరకటం కష్టం.

★★★

దుఃఖం తరవాత వచ్చిన సుఖమే హాయిగా ఉంటుంది. ఎండలో తపించిన వాడికే చెట్టునీడలో ఉండే సుఖం తెలుస్తుంది.



# దేశభక్తి - ఉగ్రవాదం

స్వాతంత్ర్యకాంక్ష ప్రాణి కోటికి సహజం. రాజకీయ స్వాతంత్ర్యం సాధించాక భారతీయుల మైన మనం వాక్ స్వాతంత్ర్యం, భావ స్వాతంత్ర్యం, మత స్వాతంత్ర్యం మొదలైన వాటిని అనుభవిస్తున్నాం. అయితే, ఇవాళ ఈ స్వాతంత్ర్యాన్ని దురపయోగం చేసుకునే పెడ దోరణి కనిపిస్తోంది.

దేశంలో శాంతి భద్రతలకు భంగం కలిగించి అస్థిరతను సృష్టించాలన్న ఉద్దేశంతో కొన్ని స్వార్థ ఉన్మాద శక్తులు పని చేస్తున్నాయి. అందుకు ఉగ్రవాద ఆయుధాన్ని ఉపయోగి స్తున్నాయి. పర్యవసానంగా అమాయక ప్రజలు ప్రాణాలు కోల్పోతున్నారు. అపార ఆస్తి నష్టంతోపాటు దేశంలో ఎప్పుడు ఎలాంటి ప్రమాదం ముంచుకు వస్తుందోనన్న భయానక వాతావరణం నెల కొంటూన్నది.

ఇలాంటి ఉగ్రవాద కార్య కలాపాలలో యువకులు పాల్గొనడం ఆందోళన కలిగించే విషయం. ఉగ్రవాదుల చేతుల్లో ఇలాంటి యువకులు పావులుగా మారుతున్నారు. యువకులు నేరస్థులుగా పట్టుబడుతున్నారు. వారిని నడిపించే అసలు నేరస్థులు తప్పించుకుంటున్నారు. ఇది మరీ ఘోరం!

సుదీర్ఘపోరాటం, అనుపమ త్యాగాల పర్యవసానంగా సిద్ధించిన స్వాతంత్ర్య ఫలాలను ఆస్వాదించడానికి బదులు ఈ తరం యువకులు కొందరు స్వార్థ రాక్షస శక్తులకు బలియై పోవడం విషాదకర విషయం. మన పెద్దలు సాధించిన స్వాతంత్ర్యాన్ని కాపాడు కోవడానికి, మన దేశ సార్వభౌమత్వాన్ని రక్షించడానికి ప్రతి యువకుడు ముందుకు రావాలి. అందుకు ప్రతి ఒక్కరిలో మాతృదేశభక్తి, స్వాతంత్ర్యం పట్ల గౌరవం పెంపొందాలి. ఉగ్రవాదాన్ని దేశభక్తిలోనే రూపుమాప గలం!

సంపాదకుడు : **విశ్వం**







*Founded by*
**B. Nagi Reddi and Chakrapani**

*Editor, Publisher :* B. Viswanatha Reddi (Viswam)
*Chief Executive Officer :* L. Subramanyan
*Editorial Advisors :* Ruskin Bond, Manoj Das
*Consultant Editor :* K. Ramakrishnan
*Associate Editor :* A.R. Balasubrahmanyam
*Senior Artists:* K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
*Artist :* Jayapandian
*Assistant Editor :* R. Sudha
*Creative Writer :* R. Vaasugi
*Layout Designer :* B.A. Hemalata Malini

CIRCULATION TEAM :
Chennai : T N Ravi Shankar, National Sales Manager
Mobile +91 99620 70014
email : ravishankar.tn@chandamama.com
Fazal Khan, Manager-Circulation & Institutional Sales - South
Mobile +91 99625 67860
email : fazal.khan@chandamama.com
Mumbai : Rajendra K Jadhav, Asst. Manager - Circulation
Mobile +91 9320565048
CHANDAMAMA INDIA LTD., B-3, Lunic Industry
Opp. State Bank of India, Near Police Station Cross Road
No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com
New Delhi : Sushil Sharma, Circulation Manager-North
Mobile +91 98719 30767
CHANDAMAMA INDIA LTD., Goyal Business Centre,
C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
Bangalore : P. Murali, Asst. Circulation Manager - Karnataka
Mobile +91 94488 36952
CHANDAMAMA INDIA LTD., 18, 10th Cross, Mayura Street
Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage
Bangalore-560094, Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
Kolkata : Ananth Prakash, Circulation Manager-East
Mobile +91 98362 82202
email : ananth.prakash@chandamama.com
Ahmedabad : Kalpesh Raval, Sales Officer-Circulation
Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com
Content Head - Online : Sowmya Bharadwaj
email : sowmya.b@chandamama.com
Head - Business Development : Surajit Agarwal
email : surajit@chandamama.com
Advertisement : email : sales@chandamama.com
Subscription Queries: L Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
Customer Cell : A B Sairam Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
Production Executive : Panchakshari R Math
Head Office : CHANDAMAMA INDIA LTD.,
JVL Plaza, Block-A, 6th Floor, 626, Anna Salai,
Teynampet CHENNAI-600018
Phone +91 44 24334455, Fax +91 44 2432 2103
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

**ANNUAL SUBSCRIPTION :**
Foreign : US$30 (including shipping and handling charges)

# పాఠకుల లేఖలు



ప్రతిఫలాపేక్ష లేకుండా మానవత్వంతో చేసే సహాయం చాలా గొప్పదని చాటిన బేతాళ కథ 'చిరునాధుడి వితరణ' చాలా బావుంది. అహంకారంతో పరాభవించడానికీ, ప్రతీకారాలకూ పూనుకుంటే ఎంతటి గొప్పవారి జీవితమైనా సరే వినాశాలకు దారి తీస్తుందన్న వాస్తవం ధృష్టద్యుమ్నుడి ఉదంతంలో చక్కగా వివరించబడింది. ''వివేకం మానవుడి ప్రధాన ధర్మం. అవివేకమే దుర్గతికి కారణం. రహస్యాలను దాచగలిగిన వాడే శత్రువును దూరంగా ఉంచ గలుగుతాడు,'' అన్న సత్యాన్ని తెలియజేసిన జాతక కథ సందేశాత్మకంగా ఉన్నది.

–యతిరాజులు, తిరుత్తణి (త.నా)

ఖరగ్‌పూర్‌లో చిరకాలం మేము ప్రతిష్ఠాత్మకమైన 'చందమామ'కు ఏజెంటుగా వ్యవహరించడం ఇప్పటికీ నేనొక గౌరవంగా భావిస్తాను. రచయితలు అందించే చక్కటి కథలకు కళ్ళకు కట్టించేట్టు అందమైన బొమ్మలు వేయడం చందమామ ఆర్టిస్టులకే చెల్లింది. బేతాళకథలు, ముగ్గురు మాంత్రికులు, రాకాసిలోయ లాంటి సీరియల్స్ పాఠకులను ఉత్రూతలూగించేవి. నా కథ తెలుగులో రావడంతో పాటు అది వివిధ భాషల్లోకి అనువదింప బడటం మరువరాని జ్ఞాపకం. ఫోటో వ్యాఖ్యలు ఎంతగొప్పగానో ఉండేవి. జ్ఞాపకాల మడతల్లోంచి తొంగిచూస్తూ చందమామ జ్ఞాపకాలు ఎన్నో ఎన్నెన్నో.

–మాధవీ సనారా, అనకాపల్లి–531 002



# మాయపొర

జయపురంలో శంకరశర్మ అనే ఉద్దండ పండితుడు ఉండేవాడు. ఆయన వేద వేదాంగాలను, ధర్మశాస్త్రాలను క్షుణ్ణంగా చదివాడు. ఆసువుగా కవిత్వం చెప్పే అసాధారణ ప్రతిభ కూడా ఆయనకు సిద్ధించింది. తన వద్దకు వచ్చేవారికి మంచిచెడ్డలు విడమరిచి చెబుతూ, పౌరోహిత్యంతో జీవయాత్ర సాగించేవాడు. ఆయనంటే ఆ ఊళ్ళోనేకాకుండా చుట్టుపక్కల గ్రామాలలోనూ గౌరవమర్యాదలు ఉండేవి.

శంకరశర్మకు అధిక సంతానం కావడంతో కుటుంబ అవసరాలు తీర్చడానికి చాలాశ్రమ పడేవాడు. ఇంత జ్ఞాన సంపద ఉండీ కుటుంబపోషణ పెనుభారంగా మారిందేమిటా అని తన దుస్థితిని తలుచుకుని విచారపడేవాడు. తనకు సరస్వతీ కటాక్షం తప్ప లక్ష్మీ కటాక్షం లేకపోయింది కదా అని అప్పుడప్పుడు మనసులో కలత చెందేవాడు.

ఒకనాటి సాయంకాలం శంకరశర్మ తన ఇంటి అరుగు మీద కూర్చుని ఏదో గ్రంథం చదువుకుంటున్నాడు. ఆ సమయంలో అక్కడికి వచ్చిన ఆ ఊరి పేదరైతు చిన్నయ్య, ''స్వామీ, మా ఇంటి పాతగోడను పడగొడుతూంటే గోడలోపల పెట్టెలో ఇది దొరికింది. అక్షరం ముక్క రానివాణ్ణి. దీన్ని నేనేం చేసుకుంటాను. మీరే ఉంచుకోండి,'' అంటూ ఒక తాళపత్ర గ్రంథాన్ని అందించాడు.

''ఈ గ్రంథాన్ని ఏ గంగపాలో చేయకుండా, అక్షర జ్ఞానం లేకున్నా భద్రంగా తెచ్చి ఇచ్చినందుకు సంతోషం. ఇందులోని విషయంతీరిగ్గా చదివి నీకు చెబుతాలే,'' అంటూ దాన్ని పుచ్చుకున్నాడు శంకరశర్మ.

మరునాడు ఉదయమే ఆయన చిన్నయ్య ఇచ్చిన గ్రంథాన్ని చదవడం మొదలు పెట్టాడు. అందులో విభిన్న విషయాలు ప్రస్తావించ

కంచనపల్లి వేంకట కృష్ణారావు



భయం వేసింది. వెంటనే ఆ ఊళ్ళోని వస్తాదును కలుసుకుని, ''కొండయ్యా, తూరుపు కొండల్లో ఒక అమూల్యమైన మూలికను సేకరించ వలసి ఉన్నది. తోడుగా వచ్చావంటే నువ్వు అడిగే ధనం ఇస్తాను. అయితే, ఈ విషయం బయట పొక్కనీయకు. తిరిగి వచ్చేంత వరకు రహస్యంగా ఉంచాలి,'' అన్నాడు.

అంత పెద్ద పండితుడు తన సాయం అడిగినందుకు పరమానందం చెందిన కొండయ్య ఆయనకు తోడు వెళ్ళడానికి వెంటనే ఒప్పుకున్నాడు.

మరుసటి రోజు వేకువజామునే, కొండయ్య తోడుగా శంకరశర్మ, ఇద్దరకీ సరిపడా రొట్టెలు మూటగట్టుకుని తూరుపు కొండల కేసి బయలుదేరాడు. మూడు రోజుల ప్రయాణం తరవాత ఇద్దరూ తూరుపు కొండలు చేరుకున్నారు. తాళపత్ర గ్రంథంలో సూచించిన విధంగానే మార్గ మధ్యంలో అక్కడక్కడ గుర్తులు కనిపించడంతో శంకరశర్మ, సంతోషంగా ఎత్తయిన గుట్టను ఎక్కి ఆవల దిగి గంభీరంగా కనిపించిన పెద్ద కనకదుర్గ విగ్రహానికి చేతులెత్తి నమస్కరించి దాని వెనకగా ఉన్న గుహలో అడుగుపెట్టాడు. వెంటనే, ''ఎవడురా వాడు? ఈ గుహలో అడుగు పెట్టడానికి ఎన్ని గుండెలు?'' అన్న భీకర కంఠస్వరం విని ఉలిక్కి పడి శంకరశర్మ అలాగే నిలబడ్డాడు.

మరుక్షణమే గుహ ప్రతిధ్వనించేలా నవ్వుతూ భయంకరాకారుడైన ఒక రాక్షసుడు

బడినప్పటికీ నవదుర్గల గురించీ, అష్ట విధ ఐశ్వర్యాల గురించీ విపులంగా వివరించబడి ఉన్నది. చివరగా తూరుపు కొండల్లో కనకదుర్గ విగ్రహం వెనకగా ఉన్న గుహలోని గుప్త నిధిని గురించి సూచన ప్రాయంగా తెలియజేయ బడి ఉన్నది.

నిధివిషయం చదివేసరికి శంకరశర్మ పరమానందం చెందాడు. తన దారిద్ర్య బాధ తొలగి పోగలదని తెలియగానే ఆయన మనసులో కుతూహలం ఉప్పొంగింది. ఇన్నాళ్ళకు దేవుడు తన మొర ఆలకించాడనీ, లక్ష్మీ కటాక్షం కూడా కలగనున్నదనీ ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. ఈ విషయం గ్రంథం ఇచ్చిన చిన్నయ్యకు చెబితే ప్రమాదకరమని ఊరుకున్నాడు. అయితే, తూరుపు కొండల్లోకి ఒంటరిగా వెళ్ళడానికి శంకరశర్మకు

వాళ్ళ ముందుకు దూకి, ''నిధి కోసం వచ్చారా?'' అని అడిగాడు.

''అవును,'' అన్నాడు శంకరశర్మ గడగడా వణుకుతూ.

''నువ్వు పండితుడివే కదా?'' అని అడిగాడు రాక్షసుడు.

''అవును. అయినా, అది నీకెలా తెలుసు?'' అని అడిగాడు శంకరశర్మ.

''నిన్ను చూస్తూంటే అలా అనిపించింది. నేనూ ఒకప్పుడు నీలాంటి పండితుడినే గనక సులభంగా తెలుసుకోగలిగాను,'' అన్నాడు రాక్షసుడు.

''మరి ఈ రాక్షసరూపమేమిటి?'' అని అడిగాడు శంకరశర్మ ధైర్యాన్ని కూడదీసుకుంటూ.

''నాలోని అత్యాశ తెచ్చిపెట్టిన రూపం ఇది. సరిగ్గా ముప్ఫై సంవత్సరాల క్రితం నేనొక పండితుణ్ణి. ఒకనిరుపేద బ్రాహ్మడికి ఒక ముని ఇచ్చిన తాళపత్ర గ్రంథాన్ని రహస్యంగా దొంగిలించి, అందులో ఉన్న నిధిరహస్యాన్ని తెలుసుకుని మూడో కంటికి తెలియకుండా ఇక్కడికి వచ్చాను. నిజానికి ఈ నిధి ఒక గంధర్వుడిది. నిధినంతా నాసొంతం చేసుకోవాలన్న నా అత్యాశను గ్రహించిన గంధర్వుడు రాక్షసుడివికమ్మని నన్ను శపించాడు. పాదాలపైపడి క్షమించి తరుణోపాయం తెలియజేయమని వేడుకున్నాను. 'ఎవరైనా నీలాగే అత్యాశతో ఇక్కడికి వచ్చి, నీ ద్వారా అత్యాశను పోగొట్టుకున్నప్పుడే నీకు రాక్షసరూపం నుంచి విముక్తి. అంతవరకు ఇక్కడే పడి ఉండు,' అని చెప్పి ఆయన అదృశ్యమయ్యాడు. నువ్వు నాకీ విషయంలో సాయపడగలవా?'' అని అడిగాడు రాక్షసుడు.



''సాయపడకపోతే నేను నేర్చిన విద్యలకు సార్థకత ఉండదు. ఎదుటివారికి చెప్పేటందుకే నీతులు; అవకాశం లభించేంతవరకు అందరూ పెద్దమనుషులే - అన్న అతి సామాన్యుల స్థాయినుంచి, సర్వశాస్త్రాలూ చదివిన పండితుణ్ణయి వుండీ ఒక మెట్టు కూడా పైకి ఎగబ్రాకలేక పోయినందుకు చింతిస్తున్నాను. అత్యాశ అనే మాయపొర నా కళ్ళను కమ్మినందుకు సిగ్గుపడుతున్నాను,'' అంటూ శంకరశర్మ తను అక్కడికి ఎలా వచ్చిందీ రాక్షసుడికి వివరించాడు.

అంతావిన్న రాక్షసుడు, ''నీ మాటలు నిజమని నమ్ముతున్నాను. నేను నీకీ రత్ననిధిని అప్పగిస్తాను. అందులో సగం చిన్నయ్యకు ఇవ్వు. నీ వాటాలో సగం నీకు సాయపడ్డ ఈ కొండయ్యకు ఇవ్వు. మిగిలిన ధనంతో నీ బతుకు నిశ్చింతగా సాగిపోతుంది. నువ్వు అత్యాశను వదులుకుంటే, నాకు ఈ రాక్షస రూపం నుంచి విముక్తి లభిస్తుంది. మాట తప్పావో రౌరవాది నరకం తప్పదు,'' అని హెచ్చరించి రత్నాల మూటను అప్పగించాడు.

రత్నాల మూటతో జయపురానికి తిరిగి వచ్చిన శంకరశర్మ చిన్నయ్యకు సంగతి చెప్పి, సగం ధనం అతనికి ఇచ్చాడు. తన వాటాలో సగం కొండయ్యకు ఇచ్చాడు. మిగిలిన దానిని పాఠశాలలు, వైద్యశాలలు, సత్రాల నిర్మాణానికి వినియోగించాడు. అందులో ఒక్క దమ్మిడీ కూడా తాను ఉంచుకోలేదు. ఎప్పటిలాగే పౌరోహిత్యంతో జీవయాత్ర సాగిస్తూ పండితుడిగా, పరోపకారిగా ప్రజల మన్ననలు పొందాడు.

శంకరశర్మ ఒకనాడు పాఠశాలను పర్యవేక్షిస్తూండగా అక్కడికి వచ్చిన ఒక అపరిచిత వ్యక్తి ఆయన పాదాలపైబడి, ''నాకు రాక్షస రూపం నుంచి విముక్తి కలిగించినందుకు కృతజ్ఞతలు,'' అన్నాడు.

అతడు తనకు గుహలోని నిధిని అప్పగించిన రాక్షసుడని క్షణంలో గ్రహించిన శంకరశర్మ, '' నా కళ్ళకు కమ్మిన అత్యాశ అనే మాయపొరను తొలగించినందుకు నేనే నీకు రుణపడిఉన్నాను,'' అంటూ అతణ్ణి ఆప్యాయంగా లేవనెత్తాడు.



మన వారసత్వ స్థలాలు

# చంపానర్ - పావగఢ్ పార్క్



అహ్మదాబాదు సమీపంలోని పావగఢ్ పర్వత పాదతలంలో వెలసిన ప్రాచీన నగరం చంపానర్. ఈ నగరానికీ పేరు రావడానికి రెండు కారణాలు చెబుతారు. ఈ నగరాన్ని నిర్మించిన చంపరాజ్ పేరు మీదుగా దీనికీ పేరు వచ్చిందని కొందరు విశ్వసిస్తారు. ఇక్కడ విస్తారంగా కనిపించే చంపా చెట్ల కారణంగా ఈ నగరానికీ పేరు వచ్చిందని మరి కొందరు భావిస్తారు. సంపన్నమైన చారిత్రక సంస్కృతిగల ఈ నగరం పట్టు నేత వస్త్రాల వ్యాపారానికీ, కత్తుల తయారీకీ పేరుగాంచింది.

చంపానర్‌లో చాలా శిథిలాలు ఉన్నాయి: కోటగోడలు, సమాధులు, ఉద్యానాలు, ద్వార తోరణాలు, స్తంభాలు, బావులు ఆ ప్రాంత గత వైభవానికి మౌనసాక్ష్యాలుగా నిలిచి ఉన్నాయి. ఈ ప్రాంతానికి చంపానర్ - పావగఢ్ ఆర్కియోలాజికల్ పార్క్ అని పేరు పెట్టారు. గుజరాత్‌లో 16వ శతాబ్దంలో వెలసిన తొలి హిందూ రాజధాని కొండకోట, భవనాలు, దేవాలయాలు, నివాస ప్రాంతాలు, వ్యవసాయ నిర్మాణాలు, శిథిలాలు కనిపిస్తాయి. ఇవి 8వ శతాబ్దం 14వ శతాబ్దం మధ్య కాలానికి చెందినవి. పావగఢ్ కొండ మీద అందమైన కాళికామాత ఆలయానికి యేడాది పొడవునా వేలాది మంది భక్తులు వస్తూ ఉంటారు. ఉత్తరోత్తరా అంతగా మార్పులకు లోనుకాని ఏకైక సంపూర్ణ నగరం గనక, ఇది మొగల్ - ఇస్లాం కాలానికి పూర్వంనాటి స్థితిగతుల అధ్యయనానికి కీలకమైన ప్రాముఖ్యతను సంతరించుకున్నది.

చంపానర్ - పావగఢ్ ఆర్కియోలాజికల్ పార్క్‌ను నైసర్గిక రూపాన్ని చక్కగా ఉపయోగించుకున్న చిన్న రాజధానికి ఉదాహరణగా చెబుతారు. దాని ప్రకృతిసిద్ధమైన అంశాలు, రూపురేఖలు దానిని యునెస్కో ప్రపంచ వారసత్వ ప్రదేశంగా స్వీకరించడానికి ప్రేరకాలయ్యాయి.

ఆసక్తికర ప్రదేశాలు: (1) చంపానర్ శిథిలాలు : ఇవి హంపీని పోలినవి. కోట లోపల చక్కగా రక్షించబడ్డ షహర్‌కీ మస్జీద్ ఉన్నది. (2) పావగఢ్ కొండ మీది కాళికా మాత ఆలయం: నిర్మాణ కౌశలానికన్నా మత ప్రాముఖ్యతకు ప్రసిద్ధి గాంచిన దేవాలయం. సగం దూరం నుంచి కొండమీదికి వెళ్ళడానికి కేబుల్ కార్ సదుపాయం ఉన్నది. దీనితో పాటు 1,500 మెట్లతో మామూలు మెట్లదారి కూడా ఉన్నది. దారి పొడవునా చిన్నచిన్న దుకాణాలు ఉన్నాయి. కొండను ఎక్కేప్పుడు శక్తినిచ్చే 'నింబూపానీ' తాగవచ్చు!



# బాలల దినోత్సవం
# ఓ ఇంద్రజాల ఉదంతం!

**జ**వహర్‌లాల్ నెహ్రూ ఒకసారి తమిళనాడులో పర్యటిస్తున్నారు. ఆయన రాకకోసం వీధులకు ఇరువైపులా జనం బారులు తీరి ఎదురు చూస్తున్నారు. కుర్రాళ్ళు చెట్ల మీదికి ఎగబ్రాకి కూర్చున్నారు. ప్రజలకు అభివాదం చేస్తూ జీపులో వచ్చిన నెహ్రూ దృష్టి ప్రజల గుంపుకు చివర ఎగురుతూన్న రంగురంగుల బుడగల మీద పడింది. పెద్ద పెద్ద బెలూన్లను కట్టిన దారాన్ని చేత్తో పట్టుకుని వాటిని అమ్మడానికి వచ్చాడు ఒక వ్యాపారి.

నెహ్రూ వాహనాన్ని ఆపమన్నారు. కిందికి దూకి బెలూన్లు అమ్మే వ్యక్తిని దగ్గరికి రమ్మని పిలిచారు. అతడు దగ్గిరికి రాగానే తన సహాయకుడితో చెప్పి, బెలూన్లన్నిటినీ కొని పిల్లలకు పంచమన్నారు. సంతోషంగా బెలూన్ను అందుకున్న ఒక పాపాయి దగ్గరికి చిరునవ్వుతో వెళ్ళి, సుతారంగా బుగ్గను తాకి, తిరిగివచ్చి జీపులోకి ఎక్కి ప్రయాణాన్ని కొనసాగించారు!

''ఇందులో ఇంద్రజాలం ఎక్కడ?'' అని అడుగుతున్నారు కదూ! అది నెహ్రూ పిల్లలకిచ్చిన బెలూనల్లో ఉన్నది. పిల్లల పట్ల ఎంతో విశ్వాసం ఉంచిన ఒక నాయకుడు వాళ్ళను సంతోషపరచడానికి ప్రదర్శించిన ఇంద్రజాలం అది.



బాల్యం అంటే ఏమిటో మరిచిపోని పెరిగిన ఓపెద్ద చూపిన ఇంద్రజాలం అది. పిల్లల్లాగా వినోదానికి విలువనిచ్చిన ఓ గొప్ప నాయకుడికి సంబంధించిన ఇంద్రజాల ఉదంతం అది. అలాంటి ఇంద్రజాలాన్ని మరే జార్‌లోనూ కొనలేము.

*నవంబర్ 14 సందర్భంగా పాఠకులందరికీ చందమామ బాలల దినోత్సవ శుభాకాంక్షలు తెలియజేస్తున్నది!*




# పాతాళదుర్గం

## 4

[రాత్రివేళ కదంబరాజనగరులో ఒక మహాకాయుడు ప్రవేశించి, రాజకుమార్తె కాంతిసేనను అపహరించి, ఎత్తుకుపోసాగాడు. రాజభవనంలో గగ్గోలు చెలరేగింది. కావలివాళ్ళు అతడి మీదికి బాణాలూ, ఈటెలూ విసిరారు. వాటిని పట్టించు కోకుండా అతడు పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ అరణ్యం కేసి నడవసాగాడు. రాజు ఉగ్రసేనుడు ఆజ్ఞాపించగా కొందరు ఆశ్వికులు అతడి వెంట బడ్డారు. మరికొందరు అతడి మీద అగ్నిబాణాలు ప్రయోగించసాగారు. -తరవాత]

రాజప్రాసాదంలో రేగిన గగ్గోలుకు నగర మంతా మేల్కొన్నది. ప్రజల్లో చాలామంది శత్రురాజెవడో నగరం మీద దాడి కొచ్చాడని భయపడ్డారు. వాళ్ళల్లో కొందరు నగర ద్వారాల కేసి పరిగెత్తారు.

ఇంతలో భటులు వదిలిన అగ్నిబాణాలు కొన్ని గురితప్పి నగరంలోని ఇళ్ళ మీద పడినై. ఆ వెంటనే అక్కడా ఇక్కడా చిన్నచిన్న మంటలు లేచినై. ప్రజల్లో భీతాహం పుట్టింది. వాళ్లు తమ తమ గృహాలు రక్షించు కునేం దుకు వెనుదిరిగి పరిగెత్తసాగారు.

మేడ పైభాగాన నిలబడి ఇదంతా చూస్తున్న రాజు ఉగ్రసేనుడు మంత్రి కేసి తిరిగి, ''అమాత్యా, ఇదీ మన ప్రజల రాజభక్తి! కష్టకాలంలో ఎవడి క్షేమం వాడు చూసుకునే వాడే తప్ప, మన రక్షణకై వచ్చి నిలబడే

'చందమామ'



వాడొక్కడూ లేడు. నిజంగా శత్రు రాజే దాడికి వస్తే, కోట రక్షణకు సహాయ పడేవాడు వీళ్ళల్లో ఒక్కగా నొక్కడైనా ఉండడు,'' అన్నాడు కోపంగా.

''మహారాజా, రాజ్యరక్షణకు మనం జీత భత్యాలిచ్చి పోషిస్తున్న సైనికులున్నారు గదా, ఈ పిరికి ప్రజవల్ల అయ్యేదేమిటి? వాళ్ళ చావు వాళ్ళని చావ నివ్వండి,'' అంటూ మంత్రి అగ్నిబాణాలు ప్రయోగిస్తున్న భటులను రాజుకు చూపుతూ, ''మనవాళ్ళు రాక్షసుడి మీద ప్రయోగించే బాణాలూ, ఈటెలూ రాజకుమార్తెకు హాని కలిగించ వచ్చు. ఆ విషయమై భటులను హెచ్చరించటం అవసరం గదా,'' అన్నాడు.

ఉగ్రసేనుడు, ''అవునవును!'' అంటూ తల ఊపి, తొందర తొందరగా భవనం మీది నుంచి కిందికి దిగిపోతూ, ''అమాత్యా! నేను రాజధానికి తిరిగి వచ్చే వరకూ నగరరక్షణ బాధ్యత మీరే వహించాలి. శతభానుడు దేనికైనా సమర్థుడు. మనం అతడి దగ్గిరకు పంపిన దూత లేమయ్యారో తెలియటం లేదు,'' అన్నాడు.

అంతలో ఒక సేవకుడు గుర్రాన్నొకదాన్ని మెట్ల వద్దకు తెచ్చి నిలబెట్టాడు. ఉగ్రసేనుడు ఒక్క ఎగురున దాన్ని అధిరోహించి, కొందరు రౌతులు వెంట రాగా, నగరద్వారం దాటి అరణ్యమార్గం పట్టాడు.

మంత్రి కొంచెం సేపు రాజు పోయినవైపుకే చూస్తూ నిలబడి, తరవాత కోట బురుజు కేసి నడుస్తూ, ''ఈ ఉగ్రసేనుడు రాజ్యాన్ని మరెంతో కాలం నిలబెట్టుకోలేడు,'' అనుకున్నాడు.

కదంబనగరానికి తూర్పుదిక్కున వున్న అరణ్యం, కొండప్రాంత మంతా కాగడాలూ, దివిటీలూ పట్టుకు తిరుగుతున్న సైనికులతో నిండిపోయింది. ''దివిటీల వెలుగులో తనను వెతికేవాళ్ళను రాక్షసుడు తేలిగ్గా గుర్తిస్తాడు. అలాంటప్పుడు వాడు వీళ్ళ కెలా దొరుకుతాడు!'' అనుకుంటూ మంత్రి ఆశ్చర్య పోయాడు.

అరణ్యంలో ధూమకసోమకులకూడా ఇలాంటి అనుమానమే కలిగి, కదంబరాజు తెలివితక్కువతనానికి నవ్వుకున్నారు. వాళ్ళిద్దరూ, సైనికులు తామున్న ప్రాంతానికి రాగానే, గుర్రాలు దిగి, వాటిని గుబురు చెట్ల చాటున దాచి, ఒక పెద్ద చెట్టెక్కి కొమ్మల్లో

దాక్కున్నారు. కదంబ సైనికుల్లో కొందరు కాగడాలు పట్టుకుని, ఆ చెట్టు కిందికి వచ్చి, సంభాషించుకోసాగారు. వాళ్ళ మాటల వల్ల ధూమక సోమకులకు రాజకుమార్తె అప హరణా, ఉగ్రసేనుడు స్వయంగా అరణ్యం లోకి వచ్చిన సంగతీ తెలిసింది.

‘‘ఆ దుర్మార్గుణ్ణి చంపటానికి మన కిది మంచి అవకాశం,’’ అన్నాడు సోమకుడు పట్టరాని ఉత్సాహంతో.

‘‘తొందరపడకు సోమూ! మనం సైనికుల దుస్తుల్లో వున్నట్టయితే, ఆ పని సాధ్య మయ్యేది. ఇప్పుడు మనమున్న వేషంలో, ఎవరి కంటనైనా పడ్డామో, ముందు మనం చావటం ఖాయం,’’ అన్నాడు ధూమకుడు.

కదంబ సైనికులు చెట్టుకింది నుంచి వెళ్ళి పోయారు.

‘‘సోమూ, ఇక మనం చెట్టు దిగి, ఇంకా చీకటి వుండగానే మన గ్రామం చేరటం మంచిది. మన కుటుంబాలను ఈ రాజ్య సరిహద్దులు దాటించందే, మనం ఎలాంటి సాహసానికీ పూనుకోగూడదు,’’ అన్నాడు ధూమకుడు.

సోమకు డేమీ జవాబివ్వలేదు. ఇద్దరూ చెట్టుకొమ్మల్లోంచి కిందికి రాసాగారు.

అంతలో కొంచెం ఎడంగా వున్న ఊడల మర్రి చాటు నుంచి నల్లని భయంకరాకారం ఒకటి బయటికి వచ్చి దాపుల నున్న కొండ గుహల కేసి నడవసాగింది. దాని భుజం మీద ఒక మానవాకృతి నిశ్చేతనంగా పడివున్నది. ధూమకుడు, సోమకుడి భుజం పట్టుకుని




ఆగమని హెచ్చరించి, గుహల కేసి పోతున్న భయంకరాకారాన్ని అతడికిచూపుతూ, ‘‘అడుగో రాక్షసుడు! వాడి భుజం మీద వున్నది రాజకుమార్తె, అనుమానం లేదు. ఆమె ధరిం చిన వజ్రవైడూర్యాలు, ఈ గుడ్డివెన్నెల్లో కూడా ఎలా మిలమిలా మెరిసిపోతున్నవో, చూశావా!’’ అన్నాడు. సోమకుడు ఆ దృశ్యం చూస్తూనే నిశ్చేష్టుడై పోయాడు.

రాక్షసుడు గుహల్లో ఒకదాన్ని సమీపించే సరికి లోపలి నుంచి, ‘‘ఎవరు వాళ్ళు? వెనక్కు తిరిగి పొండి!’’ అన్న గంభీర కంఠ స్వరం వినబడింది.

‘‘ఒరే మనిషీ, గొంతు పగిలేలా అంత పెద్దగా అరవకు! నే నీ రాత్రి ఎవణ్ణీ చంప కూడదని ఒట్టేసుకున్నాను. మర్యాదగా గుహ నుంచి బయటికి వచ్చి, కిక్కురు మనకుండా




కొడుతూ వచ్చి, కుంభీరుడి తలను బలంగా తాకింది.

అంత బలశాలి అయిన కుంభీరుడు, మంత్రదండం దెబ్బ తింటూనే కింద పడి పోయాడు. కాని ఆ పడేటప్పుడు రాజకుమారి కాంతిసేనకు అపాయం కలక్కుండా జాగ్రత్త పడ్డాడు. కాంతిసేన అప్పుడే నిద్ర నుంచి మేల్కొన్నట్టు కళ్ళు తెరిచి చుట్టూ కలయ చూసింది. ఆమె ఎత్తుగా పెరిగి తివాసీలా ఉన్న పచ్చిగడ్డిపై పడుకుని వున్నది. పక్కనే తనను అపహరించుకు వచ్చిన మహా కాయుడు తల చేతులతో పట్టుకుని మూలు గుతూ, మధ్య మధ్య పళ్ళు కొరుకుతున్నాడు. అతడి తల మీద వున్న కొమ్ముల్లో ఒకటి - కుడివైపుది మంత్రదండం దెబ్బకు విరిగి పోయింది. అక్కడ కలిగిన గాయం నుంచి సంతత ధారగా రక్తం కారుతున్నది.

మహా భయంకరుడైన ఆ రాక్షసుణ్ణి, ఆ దీనస్థితిలో చూడగానే కాంతిసేనకు అత డంటే భయం పోయి, ఎంతో జాలి కలిగింది. ఆమె చప్పున లేచి కూర్చుంటూ, ''ఓ మహా రాక్షసా! నన్ను తినదలుచుకున్న వాడివి, ఇంత దూరం ఎందుకు తెచ్చావు? నిన్ను గాయపరిచిందెవరు? మా తండ్రిగారేనా? ఆయన గొప్ప శూరుడు, శరణన్న వాళ్ళను వధించడు. ఇప్పుడు కూడా మించి పోయింది లేదు. ఆయన్ను బతిమాలి నీకు ప్రాణదానం చేయిస్తాను, '' అన్నది.

రాజకుమారి మాటలు వింటూనే కుంభీ రుడికి అంత బాధలోనూ నవ్వాగింది కాదు.

వెళ్ళిపో,'' అన్నాడు రాక్షసుడు. ''నువ్వెవడో రాక్షసుడిలా కనిపిస్తున్నావ్. నేనిక్కడ ఒక మహావీరుడికి మూలికా వైద్యం చేసి గాయాలు మాన్పి, ఇప్పుడే స్పృహ తెప్పిం చాను. బీరాలు పలక్కుండా గుహముందు నుంచి కదిలి, కంయ్ కుంయ్ మనకుండా నీ దారిన పో!'' అన్న జవాబు వచ్చింది గుహ లోనుంచి.

ఆ జవాబు వింటూనే రాక్షసుడు ఉగ్రుడై పోయి, ''ఒరే, మనిషీ! ఎంత మాటన్నావ్? నేను రాక్షసుణ్ణిరా, కుంభీరుణ్ణి!'' అంటూ హుంకరించి గుహకేసి ఒకడుగు వేశాడు.

''నేను మాంత్రికుణ్ణిరా, కాలశంబరుణ్ణి! కాచుకో!'' అంటూ గుహ నుంచి కేక విన బడింది. ఆ వెంటనే మెరుస్తున్న శంబరుడి మంత్రదండం వేగంగా పాములా బుస

అతడికి ఆమె మాట్లాడిన తీరు కూడా ఎంతో ముచ్చట కలిగించింది.

కుంభీరుడు కూర్చున్న చోటు నుంచి లేచి కొద్ది దూరంలో వున్న పొదల దగ్గరకు వెళ్ళి వాటి ఆకులు కోసి అరచేతుల్తో వాటిని బాగా మర్దించి, తల మీద నెత్తురు కారుతున్న చోట ఆ పసరు పూసుకుని తిరిగి కాంతిసేన దగ్గి రకు వచ్చాడు. అతడు వచ్చేసరికి కాంతిసేన గుహకేసి చూస్తున్నది.

''ఆ చీకటి గుహలో ఎవరో మాట్లాడు తున్నారు. వాళ్ళెవరు మహారాక్షసా? నీ అను చరులా?'' అని అడిగింది ఆమె.

కుంభీరుడు గుహకేసి రోషంగా చూసి, ''అక్కడ వున్నది నా అనుచరులు కాదు, శత్రువులు. తల మీద ఈ గాయం ఆ శత్రువు కలిగించిందే. వాడొక మాంత్రికుడు. శక్తి మంతుడిలా కనిపిస్తున్నాడు. నే వచ్చిన పని చెడిపోయే ప్రమాదం ఉన్నది కనక, ప్రస్తు తానికి వాణ్ణి ప్రాణాలతో వదిలిపెడుతు న్నాను,'' అన్నాడు.

''నువ్వొచ్చిన పనేమిటి? నన్ను గృహం నుంచి దొంగలా ఎత్తుకుపోవటమా? ఎంత గొప్ప వీరుడివి, ఛీ!'' అన్నది కాంతిసేన లేచి నిలబడుతూ.

కుంభీరుడా మాటలకు నిలువునా కంపించి పోయాడు. లజ్జతో ముఖం ముడుచుకు పోయింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అతడు కాంతిసేన ముందు చేతులు మోడ్చి మోకరి ల్లుతూ, ''అమ్మా, కాంతిసేనా! నన్నంతగా అసహ్యించుకోకు. నేను స్వతంత్రుణ్ణి కాను.




ఒకానొక మహాశక్తిమంతుడికీ, క్రూరాతి క్రూరు డికీ భృత్యుణ్ణి. నిన్ను ఎత్తుకు రావలిసిందిగా ఆజ్ఞాపించినవాడు, ఆ మహాపాపి. ఆ పని నేను కాకపోతే, అతడి భృత్యుల్లో మరొకడు – నా కన్న క్రూరాత్ముడూ, కఠినాత్ముడూ నెరవేర్చేవాడు. అతడి ఆజ్ఞకు తిరుగులేదు. కాని, నేను నిన్ను నా ప్రాణాలొడ్డి అయినా సరే కాపాడి, ఏదో ఒకనాడు నీ తండ్రి గృహానికి చేరుస్తాను,'' అన్నాడు.

''ఆ పని ఇప్పుడే ఎందుకు చేయకూడదు?'' అని ప్రశ్నించింది కాంతిసేన.

''అది మనిద్దరికీ ప్రాణగండం అయి తీరుతుంది. నిన్ను నా యజమాని తెమ్మన్న చోటుకు తీసుకుపోక తప్పదు. అయినా నువ్వేమీ భయపడకు. ఎలాగైనా నిన్నత ణ్ణుంచి నేను కాపాడి తీరుతాను. ఈ భూ

ప్రపంచంలో నీ మనస్సుకు నచ్చిన వాడితో నీకు వివాహం జరిగేలా చూస్తాను, సరా,'' అన్నాడు కుంభీరుడు.

కాంతిసేనకు ఏం మాట్లాడేందుకూ పాలు పోలేదు. కుంభీరుడి మంచితనంలో ఆమెకు కొంత నమ్మకం కలిగినా, అతడు చెబుతున్న దేమిటో కొంచెం కూడా అర్థం కాలేదు. ఇప్పుడు తను చేయగలిగిందేమిటి? పారి పోయే ప్రయత్నం చేయటం వృథా. రాక్షసుడి కన్ను గప్పటం సాధ్యమయ్యేది కాదు. సహాయం కోసం కేకలు వేసి ప్రయోజనం లేదు. కుంభీరుడు ఉగ్రుడై తన గొంతు నులమ వచ్చు. అతడితో మంచిగా వుంటూ సౌమ్యంగా ప్రవర్తించటమే తనకు భవిష్యత్తులో మేలు కూర్చుతుంది...

కాంతిసేన ఇలా ఆలోచిస్తున్నంతలో గుహ ముందు కాగడా వెలుగు కనిపించింది. పెద్ద పెద్ద జడలతో, ఆపాదమస్తకం కాషాయ వస్త్రాలతో, చేతిలో మంత్రదండం పట్టుకుని వున్న వికృతాకారు డొకడు ఆ వెలుగులో అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

''ఏం, రాక్షసాధమా! నువ్వింకా ఇక్కడ తగలడ్డావా? జోరీగ లాగా చెవి పక్కన ఏమిటా రొద? నీలో నువ్వే మాట్లాడుకుంటున్నావా, లేక నీ అనుచరాధము డెవడైనా పక్కను న్నాడా?'' అని ఈసడిస్తూ ప్రశ్నించాడు మాంత్రికుడు.

కాంతిసేన మాంత్రికుడికి కనబడకుండా కుంభీరుడు ఆమెకు అడ్డంగా నిలబడి, కళ్ళెర్రజేసి, పళ్ళు కొరుకుతూ, ''మాన వాధమా! నే నీ రాత్రి ఎవర్నీ చంపకూడదని ఒట్టు పెట్టుకున్నాను. అయినా, నిన్నిప్పుడు ప్రాణాలతో వదలను!'' అంటూ హుంకరించి ముందుకు అడుగు వేశాడు.

మాంత్రికుడు వికటాట్టహాసం చేస్తూ, మంత్రదండం ఎత్తి, ''ఆహా, రాక్షస పురు క్కెంత కోపం వచ్చింది!'' అంటూ దాన్ని విసర బోయేంతలో, రివ్వుమంటూ ఒక బాణం వచ్చి, అతడి చేతిని తాకింది. ఆ వెంటనే చెట్ల మీది నుంచి కేకలు వినబడినై. మాంత్రికుడు చేతిలోని కాగడాను విసిరి నేలకు కొట్టి, గుహ లోపలికి వెళ్ళాడు.

కుంభీరుడు చప్పున కాంతిసేనను భుజాని కెత్తుకుని మరో గుహకేసి పరిగెత్తసాగాడు. ఈ లోపల రివ్వురివ్వు మంటూ బాణాలు వచ్చి పడసాగినై. -(ఇంకావుంది)





# విహంగ భూషణుడి చర్య

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ‘‘రాజా, మనుషులలో ప్రధానంగా రెండు రకాలు కనిపిస్తారు. రానున్న ఫలితాల మీది అత్యధిక ధ్యాస కారణంగా చేస్తూన్న పని మీద శ్రద్ధ కనబరచలేకపోయేవారు కొందరయితే; లభించిన ఫలాలను అనుభవించకుండా చేజార్చుకునే ప్రబుద్ధులు మరి కొందరు ఉంటారు. నువ్వు రెండవ కోవకు చెందిన వాడివేమో నన్న అనుమానం నాకు కలుగుతున్నది. నీకు తగు హెచ్చరికగా ఉండేందుకు, సమయస్ఫూర్తితో యుద్ధం చేసి విజయం సాధించినప్పటికీ విజయ ఫలాన్ని పూర్తిగా ఆస్వాదించలేక



మరణించడంతో వ్యాపార లావాదేవీలన్నీ అస్తవ్యస్తమై పోయాయి. రావలసిన బాకీలను వసూలు చేసుకునే సమర్థత, చెల్లించ వలసిన బాకీలను తీర్చే స్తోమత లేకపోవడంతో యువకుడైన సాకేతుడు చిక్కుల్లో పడ్డాడు. దిక్కు తోచని పరిస్థితి ఎదురు కావడంతో మన శ్శాంతిని కోల్పోయాడు.

ఒక పున్నమిరాత్రి సాకేతుడు నిద్రపట్టక సముద్రతీరాన ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆ సమయంలో సముద్రం నుంచి ఒక అందమైన యువతి వెలుపలికి రావడం చూసి ఆశ్చర్యపోయాడు. ఆమె తిన్నగా అతణ్ణి సమీపించి, ''నేనొక జలకన్యను. నా పేరు హిమిక. క్షీరేందుడునే యువకుడూ, నేనూ ప్రాణానికి ప్రాణంగా ప్రేమించుకున్నాం. కొత్తకొత్త ప్రాంతాలు చూసిరావాలన్న కోరికతో మూడు నెలల క్రితం వెళ్ళిన క్షీరేందుడు ఇంతవరకు తిరిగి రాలేదు. ఒంటరితనం భరించలేక అతణ్ణి వెతుక్కుంటూ వచ్చాను. భూమి మీది వింతలూ, విశేషాలూ చూడాలని నాకు ఎప్పటి నుంచో కోరికగా ఉన్నది. అలా తిరిగి చూసేప్పుడు క్షీరేందుడు తారసపడినా పడవచ్చు. నాకా సాయం చేయగలవా?'' అని అడిగింది.

''నీకాసాయం చేయడానికి నాకభ్యంతరం లేదు. అయితే, అంతకు ముందు నేనుకష్టాల నుంచి గట్టెక్కడానికి నీ సహాయం నాకూ చాలా అవసరం. అది నువ్వు చేయగలవా?'' అని అడిగాడు సాకేతుడు.

''ఏమిటది?'' అని ప్రశ్నించింది హిమిక. సాకేతుడు తన క్లిష్టపరిస్థితిని వివరించి,

పోయిన విహంగభూషణుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

వరాహగిరి, కూర్మగిరి ఇరుగు పొరుగు రాజ్యాలు. వరాహగిరి రాజు విహంగభూషణుడు ప్రజాక్షేమమే ధ్యేయంగా భావించి రాజ్యపాలనసాగించేవాడు. అందువల్ల ప్రజలు ఎలాంటి కొరతా లేకుండా సుఖశాంతులతో జీవించేవారు. కూర్మగిరి పాలకుడు ఫణిధరుడు భోగలాలసుడు. పాలనా వ్యవహారాలను మంత్రులకు అప్పగించి రేయింబవళ్ళు విందు వినోదాలతో కాలక్షేపం చేస్తూ ప్రజాక్షేమం గురించి పట్టించుకునేవాడు కాదు.

కూర్మగిరి రాజ్యంలోని సముద్ర తీరపట్టణమైన రత్నగిరిలో మణికంఠుడనే రత్నాల వ్యాపారి ఉండేవాడు. సాకేతుడు ఆయన ఏకైక సంతానం. మణికంఠుడు హఠాత్తుగా

‘‘నువ్వు సముద్రంలోని మేలి ముత్యాలు, రత్నాలు తెచ్చి ఇచ్చావంటే వాటిని అమ్మి నా అప్పులు తీర్చేస్తాను. నీకు భూమి మీది వింతలూ, విశేషాలూ చూపడానికి కావలసిన ధనమూ, సమయమూ సమకూరుతాయి,’’ అని చెప్పాడు.

హిమిక అందుకు అంగీకరించి తక్షణమే వెళ్ళి సముద్రం నుంచి రత్నాలను తెచ్చి సాకేతుడికిచ్చింది. అతడు సంతోషంగా ఇల్లు చేరి వాటిని అమ్మి బాకీలు తీర్చాడు. వ్యాపారాన్ని చక్కదిద్దుకున్నాడు. హిమికకు తన ఇంట్లో ఆశ్రయం కల్పించి సకల సదుపాయాలూ సమకూర్చాడు. పట్టణంలోనూ, చుట్టుపక్కల ప్రాంతాలలోనూ జరిగే నృత్య, నాటక ప్రదర్శనలవంటి వినోద కార్యక్రమాలను చూపడానికి ఆమెకు తోడుగా తగిన యువతులను ఏర్పాటు చేశాడు.

అలా ఒకనాడు హిమిక యువతులతో కలిసి ఒక ఇంద్రజాల కార్యక్రమాన్ని తిలకిస్తూ తన్నుతాను మరిచి కిలకిలా నవ్వింది. పక్కనే నిలబడి మారువేషంలో అదే కార్యక్రమాన్ని చూస్తూన్న రాజు ఆమె కేసి తిరిగి చూసి, ఆమె అపురూప సౌందర్యానికి పరవశం చెందాడు. ఆమెను తన సొంతం చేసుకోవాలని అప్పటికప్పుడే రాజభవనానికి తరలించమని భటులను ఆదేశించాడు.

హిమిక రాజభవనంలో అడుగుపెట్టగానే ఎదురువచ్చిన మణిధరుడు, ‘‘నా మనసు దోచిన సౌందర్యరాసికి స్వాగతం! నన్ను వివాహమాడితే పట్టమహిషిని చేస్తాను. నా కోరిక మన్నిస్తావు కదూ?’’ అన్నాడు.



‘‘మహారాజా, కుసుమం వికసించాలంటే కొరడా ఝుళిపించవలసిన అవసరం లేదు. అధికారబలంతో అన్నిటినీ సాధించగలమనుకోవడం పొరబాటు. నన్ను వివాహమాడిన మరుక్షణం మీరు కూడా జలచరంగా మారిపోగలరు,’’ అని హెచ్చరించి తన గురించిన వివరాలు తెలియజేసింది హిమిక.

ఆమె హెచ్చరిక విని వెనకడుగు వేసిన మణిధరుడు కొంతసేపు మౌనంగా ఆలోచించి, ‘‘అపురూప సౌందర్యవతి వయిన నిన్ను వదిలిపెట్టే ప్రసక్తే లేదు,’’ అంటూ ఆమెను గృహనిర్బంధంలో ఉంచమని భటులను ఆజ్ఞాపించాడు.

రాజు మూర్ఖత్వానికి దిగ్భ్రాంతి చెందిన హిమిక భూమి మీద అందమైన దృశ్యాలు, వింతలు, వినోదాలతో పాటు ఇలాంటి కష్టాలు కూడా ఉంటాయని ఊహించలేక పోయినం



దుకు తనను తాను నిందించుకుంటూ కాలం గడపసాగింది.

ఇలా ఉండగా అక్కడ సముద్రంలో దూర ప్రాంతానికి వెళ్ళిన క్షీరేందుడు స్వస్థలానికి తిరిగి వచ్చాడు. హిమిక తనను వెతుక్కుంటూ భూమి మీదికి వెళ్ళిందని తెలియగానే అతను మానవరూపంలో భూమి మీదికి వచ్చి, పల్లెలూ, పట్టణాలూ పట్టి తిరుగుతూ ఆమె కోసం వెదకసాగాడు. ఎట్టకేలకు క్షీరేందుడు సాకేతుడి ద్వారా హిమిక ప్రస్తుతమున్న చోటు తెలుసుకుని రాజును దర్శించి, ''మహారాజా, నేను క్షీరేందుడనే జలచరాన్ని. నా ప్రియురాలు హిమిక తమ నిర్బంధంలో ఉందని తెలిసింది. ఆమె ఏదైనా అపరాధం చేసి వుంటే ఆమె తరఫున నేను క్షమాపణ చెబుతున్నాను. కరుణతో ఆమెను విడుదల చేసి నాతో పంపండి,'' అని వేడుకున్నాడు.

రాజుకు ఏం చెప్పాలో తోచక మంత్రికేసి చూశాడు. మంత్రి, ''క్షీరేందా, రాజ్యంలోని సకల చరాచర సంపదలూ మహారాజుకు సొంతం. ఇందులో మనుషులూ, భూచరాలూ, జలచరాలూ ఉంటూ మినహాయింపులు లేవు. మహారాజు అధికారాన్ని అధిక్షేపించే హక్కు ఎవరికీ లేదు,'' అన్నాడు.

''మహారాజు అధికారాన్ని నేను ఆక్షేపించడం లేదు మంత్రివర్యా. ఎక్కడో సముద్ర గర్భాన బతికే మమ్మల్ని విడదీయకండని బతిమాలుతున్నాను. మా మానాన మమ్మల్ని బతకడానికి విడిపించమని వేడుకుంటున్నాను. అంతే,'' అన్నాడు క్షీరేందుడు వినయంగా.

''మహారాజు అనుమతి లేకుండా మా రాజ్యంలో అడుగుపెట్టడం హిమిక చేసిన మొదటి నేరం. ఆ నేరానికి శిక్షించే హక్కు మహారాజుకు ఉన్నది. అయినా, ఇంతగా వేడుకుంటున్నావు గనక, మహారాజు అనుమతితో నీ ప్రార్థన మన్నించడానికి చిన్న నిబంధన విధిస్తున్నాను,'' అన్నాడు మంత్రి.

''ఏమిటో సెలవివ్వండి'', అన్నాడు క్షీరేందుడు ఆత్రుతగా.

''మీ నివాస స్థానమైన సముద్రం రత్నాకరం కదా? సముద్ర గర్భంలో రత్నాలరాసులు ఉంటాయి. లక్ష రత్నాలు తెచ్చి ఇచ్చావంటే నీ ప్రియురాలిని విడిపించడానికి మహారాజు అంగీకరించగలరు,'' అన్నాడు మంత్రి.

రాజు ఆమోదసూచకంగా తలపంకించాడు.

క్షీరేందుడు మంత్రి నిబంధనను తలదాల్చి, సముద్రానికి వెళ్ళి రత్నాలను ఒక్కొక్కటిగా సేకరించి తెచ్చివ్వడం మొదలు పెట్టాడు.

వివిధ రాజ్యాలలో వాటిని విక్రయించిన ధనంతో రాజుగారి ఖజానా నిండసాగింది. రాజు ఆ ధనాన్ని ప్రజోపయోగ కార్యక్రమా లకు వినియోగించకుండా స్వార్థ సుఖాలకు ఉపయోగించసాగాడు. మరికొన్నాళ్ళలో రాజ్య విస్తరణ కాంక్షతో దూర ప్రాంతాల నుంచి ఆయుధ సేకరణకు పూనుకున్నాడు.

చారుల ద్వారా ఈ సమాచారం వరాహగిరి రాజు విహంగభూషణుడికి అందింది. క్షీరేం దుడు తెచ్చి ఇస్తూన్న రత్నాల కారణంగా కూర్మగిరి ఆర్థిక పరిస్థితి బాగు పడడమే కాకుండా, సైనిక బలంలో కూడా పుంజు కుంటున్నదని తెలియగానే విహంగ భూష ణుడు కూర్మగిరిని ముట్టడించాడు.

ఈ ఆకస్మిక పరిణామానికి మణిధరుడు దిగ్భ్రాంతి చెందాడు. ధనమున్నప్పటికీ అప్పటి కప్పుడు సేనలను సమాయత్తం చేయలేక పోయాడు. వరాహగిరి సేనలను కూర్మగిరి సేనలు దీటుగా ఎదుర్కోలేక పోయాయి. యుద్ధంలో విహంగభూషణుడు కూర్మగిరి రాజు మణిధరుణ్ణీ, అతడి మంత్రినీ హతమార్చి కూర్మగిరిని స్వాధీనం చేసుకున్నాడు. హిమి కను విడిపించి, క్షీరేందుడికి అప్పగించి స్వేచ్ఛగా వెళ్ళమన్నాడు. వాళ్ళు చేతులు జోడించి, ''తమ మేలును జన్మాంతం మరిచి పోము. మేము చేయగలసాయమేదైనా ఉంటే ఆజ్ఞాపించండి. శిరసావహిస్తాం,'' అన్నారు.

''నాకు ఎలాంటిసాయమూ వద్దు. హాయిగా వెళ్ళిరండి!'' అంటూ ఆప్యాయంగా సాగనం పాడు విహంగభూషణుడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, అన్నాళ్ళు మైత్రీ సంబంధాలు నెరపిన కూర్మగిరి రాజ్యంపై



విహంగభూషణుడు హఠాత్తుగా ఎందుకు దండెత్తాడు? కూర్మగిరి సిరిసంపదలు చూసి ఈర్ష్యకులోనై యుద్ధానికి పూనుకున్నాడా? లేక జలచరాల ద్వారా తానూ సంపదలు సమకూర్చుకోవాలని ఆశించాడా? అలాంటప్పుడు అవి స్వయంగా సాయం చేస్తామన్నప్పటికీ వద్దని వాటిని వదిలి పెట్టడం అనాలోచిత కృత్యం కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

అందుకు విక్రమార్కుడు, ''దుష్టుడైన కూర్మగిరి రాజు మణిధరుడు అన్నాళ్ళు బల హీనుడు గనక, అతడి వల్ల వరాహగిరికి ఎలాంటి ముప్పూ వాటిల్ల లేదు. కాని ఇప్పుడు ఆయుధాలు సేకరిస్తూ సైనిక బలాన్ని పెంచు కుంటున్నాడు. ఏ క్షణంలోనైనా దాడి చేయ వచ్చు. దుష్టుడు బలవంతుడైతే పరులను హింసించకుండా ఊరుకోలేడు. అలాంటి అపాయాన్ని గ్రహించి, అతడు దాడి చేయక ముందే అతణ్ణి తుదముట్టించడం తన రాజ్యానికీ, కూర్మగిరి ప్రజలకూ శ్రేయస్కర మని భావించడం వల్లే విహంగభూషణుడు కూర్మగిరిపై హఠాత్తుగా దాడి జరిపాడు. జల చరాల ద్వారా సంపదలను పెంచుకోవాలనే కోరిక విహంగభూషణుడికి లేదు. ఎందు కంటే శ్రమ పడకుండా అయాచితంగా లభించే సంపదలు అనర్థదాయకాలు. పైగా వరా హగిరి, కూర్మగిరి సహజంగానే ప్రకృతి వనరులు సమృద్ధిగాగల రాజ్యాలు. గనక, అదనంగా సంపదల అవసరం లేదు. హిమికా క్షీరేందులు గాఢంగా ప్రేమించుకుంటూన్న ప్రేమికులు. పైగా, ఎక్కడో స్వేచ్ఛగా జీవిస్తూన్న జలచరాలు. స్వార్థం కోసం వాటిని విడదీసి వేధించడం అమానుష కృత్యం. రాజు అన్నవాడు తన ఏలుబడిలో ఉన్న వారిని కాపాడడానికి ప్రయత్నించాలే తప్ప వేధించ కూడదు. ఇవన్నీ ఎరిగినవిజ్ఞుడూ, ధర్మబద్ధుడూ అయిన రాజు గనకనే విహంగభూషణుడు జలచరాలను వెంటనే విడుదలచేసి, తన ధర్మపాలనను కూర్మగిరికి సైతం విస్తరింప జేశాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : గుండ్రాతి సుబ్రహ్మణ్యంగౌడు రచన]



## వినూత్న ప్రదర్శన శాల



వాషింగ్టన్‌కు వెళ్ళేవారిని ఆకర్షించే విధంగా మరో దర్శనీయ స్థలం ఏర్పాటు చేయబడి ఉన్నది. దీని పేరు 'న్యూజియం'. బెర్లిన్ కుడ్య పతనం, వరల్డ్ ట్రేడ్ సెంటర్ మీద విమానాల దాడి, బాల్కన్స్‌లో అమెరికన్ రిపోర్టర్లు ఉపయోగించిన బుల్లెట్ స్కేర్డ్ కార్ వంటి ముఖ్యమైన సంఘటనలు – పతాక శీర్షికలతో పత్రికలలో వెలువడిన కథనాలు ఇక్కడ ప్రదర్శనకు ఏర్పాటు చేయబడి ఉన్నాయి. అద్భుతమైన నిర్మాణంగా భావించబడే ఆరు అంతస్తుల భవనంలో ఈ మ్యూజియం ఉన్నది. ఏప్రిల్ 11వ తేదీ ప్రారంభించబడిన ఈ మ్యూజియం గురించి ఎగ్జిబిట్ డెవెలప్‌మెంట్ డైరెక్టర్ క్యాథీ ట్రోస్ట్, "ఇది పత్రికా రంగ ఆలయం కాదు. ఇటీవలి కాలంలో పత్రికలలో వెలువడిన గొప్ప వార్తా కథనాల ప్రదర్శన శాల," అన్నాడు. 450 మిలియన్ డాలర్ల వ్యయంతో నిర్మించ బడిన ఈ మ్యూజియంలో 20, 21వ శతాబ్దాలకు సంబంధించిన పలువిశేషాలు పొందు పరచ బడి ఉన్నాయి.

## రేపటి ఇల్లు

ప్రపంచ ప్రసిద్ధి గాంచిన డిజ్నీల్యాండ్‌ను సందర్శించినవారు భవిష్యత్తును దర్శించే అనుభూతిని కలిగించే 'టుమారో ల్యాండ్'ను చూసే ఉంటారు. అలాంటి వారిప్పుడు గత మే నెలలో కాలిఫోర్నియాలో ప్రారంభించబడిన 'హౌస్ ఆఫ్ ది ఫ్యూచర్' (రేపటి ఇల్లు)ను చూడవచ్చు. టుమారో ల్యాండ్‌లో గోడంత టీవీ స్క్రీన్, హ్యాండ్స్ ఫ్రీ ఫోన్స్, ప్లాస్టిక్ ఛెయిర్స్, ఎలక్ట్రిక్ టూత్‌బ్రష్‌లు అద్భుతమైన అనుభూతిని కలిగిస్తే; 15 మిలియన్ డాలర్ల వ్యయంతో 465 చ.మీ. విస్తీర్ణంలో అంతా ప్లాస్టిక్‌తో నిర్మించ బడిన ఈ హౌస్ ఆఫ్ ఫ్యూచర్‌లో అనుదిన జీవితాన్ని సరళతరం చేసే భవిష్యత్ హార్డ్‌వేర్, సాఫ్ట్‌వేర్, టచ్‌స్క్రీన్ సిస్టమ్స్ కనిపిస్తాయి. మీరీ అర్ధచంద్రాకార గృహంలో అడుగుపెట్టగానే లైట్స్ వాటంతట అవి అడ్జస్ట్ అవుతాయి. ఒక గది మీరు వెళ్ళే పార్టీకి నప్పే బట్టలను ఎంపిక చేసి ఇస్తుంది. ఎదుటి గదిలోని మీట, మీరు కోరుకునే వంటలకు అనుగుణంగా సరుకులను సమకూరుస్తుంది. ఒక్కసారి ఫ్యూచర్ హౌస్‌కు వెళ్ళి రావాలనుకుంటున్నారు కదూ!





# గరుత్మంతుడు

కశ్యప ప్రజాపతి భార్యలైన కద్రూ వినతలు సముద్రతీరంలో విహరిస్తున్నారు. ఉన్నట్టుండి వినత, ''ఆహా! ఆ గుర్రం ఎంత తెల్లగా ఉన్నదో చూశావా?'' అంటూ దూరంలోని ఉచ్చైశ్రవాన్ని చూపించింది.

''ఏమిటి! గుర్రం అంత తెల్లగా ఉన్నదా? నల్లగా ఉన్న దాని తోక నీకు కనిపించడం లేదా? దూరం నుంచి చూడ్డం వల్ల చూపు మందగించిందా ఏం?'' అన్నది కద్రువ.

''తోకే కాదు. ఒంటి మీద సైతం మరక అన్నది లేదు. శరీరమంతా పాలనురుగులా దవళకాంతులు వెదజల్లుతున్నది కదా,'' అని వాదించింది వినత.

''అయితే, మనిద్దరికీ పందెం. సరేనా?'' అని కవ్వించింది కద్రువ. ''సరే. ఏమిటో చెప్పు,'' అని అడిగింది వినత. ''నువ్వన్నట్టు ఆ గుర్రం తెల్లగా ఉన్నట్టయితే, నేనూ నా పిల్లలూ జీవితాంతం నీకు ఊడిగం చేస్తాం. దాని శరీరం మీద మరక ఉంటే, నువ్వూ, నీ సంతానం నాకు దాస్యం చెయ్యాలి. సమ్మతమేనా?'' అని కాలుదువ్వింది కద్రువ.

''సరే. అలాగే. రా దగ్గరికి వెళ్ళి చూద్దాం,'' అని పిలిచింది వినత.

''తప్పకుండా వెళ్ళి చూద్దాం. అయితే, ఇప్పుడు కాదు. సూర్యాస్తమయం కాబోతోంది. రేపు ఉదయం వెళ్ళి చూద్దాం,'' అని సలహా ఇచ్చింది కద్రువ.

''అలాగే,'' అంటూ వినత కద్రువ వెంట నివాసానికి వెనుదిరిగింది.

ఆ రాత్రి కద్రువ తన వెయ్యిమంది నాగ కుమారులను పిలిచి, వినతతో వేసుకున్న పందెం గురించి వివరించి, ''ఇది నా గౌరవానికి సంబంధించిన విషయం. కాబట్టి మీలో ఒకరు రేపు పెందలాడే వెళ్ళి గుర్రం తోకకు

పురాణ వీరకుమారులు - 6

చుట్టుకుని మేము వచ్చేప్పుడు దాని తోక నల్లగా కనిపించేలా చెయ్యాలి,'' అని కోరింది.

''ఇది ధర్మవిరుద్ధం,'' అని నాగకుమారులు అందుకు ఒప్పుకోలేదు. అయితే, తల్లి శాపానికి భయపడి కర్కోటకుడనే కొడుకు ఆమె చెప్పినట్టు చేయడానికి సమ్మతించాడు.

మరునాడు అనుకున్న సమయానికి కద్రూ వినతలు గుర్రం ఉన్న చోటికి వెళ్ళారు. పాము చుట్టుకున్న గుర్రపు తోక నల్లగా కనిపించడంతో వినత పందెంలో ఓడినట్టు అంగీకరించింది. కద్రువకు దాసి అయింది.

వినతా కశ్యపులకు అనూరిడి తరవాత జన్మించిన గరుత్మంతుడు అండం నుంచి బయటపడగానే, ఆకాశానికెగిసి మెరుపు వేగంతో తిరిగివచ్చి తల్లికి నమస్కరించాడు. తల్లి ఆనతి ప్రకారం కద్రువకూ, ఆమె కొడుకులైన పాములకూ దాస్యం చేయసాగాడు.

ఒకసారి గరుత్మంతుడు నాగులను వీపు మీదికెక్కించుకుని ఆకాశంలో ఎగురుతూండగా, నాగులు ఎండవేడిని తట్టుకోలేక కింద పడ్డారు. అందుకు కద్రువ గరుత్మంతుణ్ణి గట్టిగా మందలించింది.

కలత చెందిన గరుత్మంతుడు తల్లి దగ్గరికి వెళ్ళి, ''అమ్మా, కొండలను సైతం పిండి చేయగల అంతులేని బలం కలవాణ్ణయి ఉండి కూడా నేను కద్రువకూ, ఆమె కొడుకులకూ ఎందుకు దాస్యం చెయ్యాలి? నువ్వెందుకు వారికి దాసివయ్యావు?'' అని అడిగాడు. కద్రువతో పందానికిదిగి ఓడిపోయిన వైనం వివరించిన వినత, ''నేను చేసిన తప్పి



దానికి నేనే కాదు; నా కడుపున పుట్టి నువ్వూ బాధలు అనుభవిస్తున్నావు,'' అంటూ వేదనతో నిట్టూర్చింది.

గరుత్మంతుడు కద్రువ వద్దకు వెళ్ళి, ''నా తల్లినీ, నన్నూ దాస్యంలో ఉంచడం భావ్యం కాదు. దయచేసి మమ్మల్ని దాస్యవిముక్తిల్ని చెయ్యి,'' అని వేడుకున్నాడు. అందుకు కద్రువ, ''నువ్వు నాకు అమృతం తెచ్చి ఇస్తే, మిమ్మల్ని దాస్య విముక్తిల్ని చేస్తాను,'' అన్నది.

గరుత్మంతుడు అందుకు ఒప్పుకుని, తల్లి ఆశీస్సులు పొంది, దేవలోకానికి బయలుదేరాడు. మార్గ మధ్యంలో ఎదురైన అవరోధాలను అధిగమించాడు. అతడి మాతృభక్తికీ, లక్ష్యానికీ సంతసించిన బ్రహ్మదేవుడు అతణ్ణి దీవించి అమృతభాండం సాధించే ఉపాయం చెప్పాడు.

దేవలోకంలో అమృత భాండాన్ని అనేక మంది దేవతలు రక్షిస్తున్నారు. అమృత భాండం చుట్టూ అగ్ని ఉన్నది. దాని మీదుగా ఒక చక్రం తిరుగుతున్నది. భాండాన్ని రెండు మహా సర్పాలు కనిపెట్టి ఉన్నాయి.

గరుత్మంతుడు అమృత రక్షకులతో యుద్ధం చేసి వారిని తొలగగొట్టాడు. బ్రహ్మ చెప్పిన ఉపాయం ప్రకారం కొండంత వెన్నను అగ్ని ముందుంచి దాన్ని చల్లబరచాడు. సూక్ష్మ రూపంతో జాగరూకతతో చక్రం కింద దూరి, మహా సర్పాలను హతమార్చి, అమృత భాండంతో భూలోకం కేసి బయలుదేరాడు.

సంగతి తెలిసిన ఇంద్రుడు ఆగ్రహించి, అతడి మీద వజ్రాయుధం ప్రయోగించాడు. దాన్ని అవమానించడం ఇష్టం లేక అది తనకు తగలగానే శరీరం నుంచి ఒక ఈకను మాత్రం రాల్చాడు. ఇక అతనితో యుద్ధం చేయడం అసాధ్యమని గ్రహించిన ఇంద్రుడు సంధి చేసుకుని అమృతాన్ని ఎవరికీ ఇవ్వవద్దని కోరాడు.

''నా తల్లికి దాస్యవిముక్తి కలిగించడానికి అమృతాన్ని కద్రువ పిల్లల వద్దకు తీసుకు వెళ్ళక తప్పదు. అయితే, వాళ్ళు దాన్ని తాగే లోపల తిరిగి తీసుకువస్తాను,'' అన్నాడు గరుత్మంతుడు.

అదే విధంగా అమృతభాండాన్ని తీసుకు వెళ్ళి కద్రువ కొడుకుల ముందుంచాడు. తన తల్లి దాసి కాదని కద్రువ చేత ఒప్పించాడు. నాగ కుమారులు అమృతం తాగేలోపల అమృత భాండాన్ని తిరిగి స్వర్గం చేర్చాడు. అతడి శక్తి సామర్థ్యాలను దేవతలందరూ ఎంతగానో కొనియాడారు.

పుట్టుకతోనే అత్యంత పరాక్రమవంతుడైన గరుత్మంతుడు మాతృదాస్యవిముక్తి కోసం అమృత భాండాన్ని దివి నుంచి భువికి తీసుకువచ్చాడు. కార్యం నెరవేరగానే దానిని తిరిగి దేవతలకు అప్పగించి వారి మెప్పు పొందాడు.

ధర్మబద్ధుడైన వీరకుమారుడు కావడం వల్లే గరుడుడిగా, వైనతేయుడిగా ప్రసిద్ధిగాంచిన గరుత్మంతుడు-దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తూ ముజ్జగాల నేలే పరమాత్ముడైన విష్ణుమూర్తికి వాహనమయ్యాడు!






## పెరుగుతూన్న వార్తాపత్రికల పాఠకులు




ప్రపంచ వార్తాపత్రికల సంస్థ జూన్ నివేదిక ప్రకారం భారత దేశంలో ప్రతిరోజూ 9,90,00,000 వార్తాపత్రికల ప్రతులు వెలువడుతున్నాయి. ఇది ప్రపంచ దేశాలతో పోలిస్తే రెండవ స్థానం. 107,000,000 ప్రతులతో చైనా మొదటి స్థానంలో ఉన్నది. మూడవ స్థానంలో జపాన్ 68,000,000 ప్రతులతో ఉన్నది. 2007లో మాత్రం భారత దేశంలో పాఠకుల సంఖ్య 11.2 శాతం పెరిగింది. అదే సంవత్సరం ప్రపంచవ్యాప్త పెరుగుదల 2.57 శాతం మాత్రమే. ప్రపంచం మొత్తం మీద ఎక్కువగా అమ్ముడయ్యే 100 వార్తాపత్రికలలో 74 పత్రికలు ఇండియా, చైనా, జపాన్ దేశాల నుంచే ప్రచురింపబడుతున్నవి.

## ప్రస్తుతం ఉక్కుతో

కేరళకు చెందిన పాముపడవలు చాలా ప్రసిద్ధమైనవి. పడవ పోటీలలో ఉపయోగించే ఈ సన్నటి పడవలలో పాటలు పాడే వారితో సహా పడవను నడిపే దాదాపు 120 మందికి సరిపడా చోటు ఉంటుంది. ప్రత్యేకమైన రకం కలపతో ఈ పడవలను తయారు చేసేవారు. ఇప్పుడు చెట్లను కాపాడాలన్న ఉద్దేశంతో కలపతో కాకుండా ఇతర వస్తువులతో పడవలను తయారు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ దిశగా ది ఏరీస్ మెరీన్ అండ్ ఇంజినీయరింగ్ సర్వీసస్ ఉక్కుతో ఈ పడవలను విజయవంతంగా తయారు చేసింది. అది తయారు చేసిన 143 అడుగుల పొడవైన ఏరీస్ చందన్ పడవ 140 మందిని తీసుకువెళుతుంది. వేగంతోపాటు దాని మునగకుండా తేలే స్వభావం కూడా తృప్తికరంగా ఉందని తెలియవచ్చింది.



## మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (35)

# కాబోయే చక్రవర్తి తొలి సాహస కృత్యం

భారతదేశ మొగలు పాలకులలో అత్యంత సుప్రసిద్ధుడు అక్బర్ (1542-1605). షేర్షా చేత ఓడించబడిన ఆయన తండ్రి హుమాయూన్ కాబూలుకు తప్పించుకుని పారిపోయి పలుచోట్ల ఆశ్రయం పొందాడు. అలా తన ప్రతినిధిగా ఆ ప్రాంతాన్ని పాలిస్తూన్న తన తమ్ముడు మీర్జా హిందాల్ భవనంలో బస చేసినప్పుడు హుమాయూన్ హమీదా బానూను వివాహమాడాడు. ఆమె అమర్‌కోట్ పాలకుడి కోటలో అక్బర్‌ను ప్రసవించింది.

షేర్షా నుంచి తన రాజ్యాన్ని మళ్ళీ స్వాధీన పరచుకోవడానికి హుమాయూన్ రకరకాల ప్రయత్నాలు చేశాడు. కానీ సఫలీకృతుడు కాలేక పోయాడు. ఆయన కొత్తకొత్త పథకాలను రచిస్తూ, భార్యతో కలిసి విభిన్న స్థలాలలో తాత్కాలికంగా బసచేయవలసి ఉండేది. అందువల్ల పసికందుగా ఉన్న అక్బర్‌ను విశ్వాసపాత్రులైన దాది మాహం అంగా రక్షణలో ఉంచారు.

అక్బర్ నాలుగో యేట, తన మరో పినతండ్రి అయిన కామ్రాన్ భవనంలో ఉండేవాడు. ఆ సమయంలో కాబూల్ సరిహద్దుల్లో జరిగిన యుద్ధంలో హుమాయూన్ చంపబడ్డాడన్న సమాచారం వెలువడింది. కామ్రాన్ వెంటనే ఈ పరిస్థితిని అవకాశంగా తీసుకుని తనను హిందూస్థాన్ చక్రవర్తిగా ప్రకటించుకుని, అక్బర్‌ను బందీ చేశాడు.

నిజానికి హుమాయూన్ మరణించలేదు. తాత్కాలికంగా నిస్సహాయుడయ్యాడు. త్వరలోనే పుంజుకుని తన హక్కుల కోసం పోరాడడానికి మళ్ళీ ఉద్యుక్తుడయ్యాడు. అయితే, ఒక్క షేర్షా మాత్రమే కాకుండా ఇప్పుడు కామ్రాన్ కొత్త శత్రువుగా తయారయ్యాడు. అతణ్ణి మొదట అణగదొక్కవలసి ఉన్నది.

హుమాయూన్ సైన్యం కామ్రాన్ కోటను ముట్టడించింది. అయితే, కోట ముందు పటిష్ఠంగా రక్షణావలయాన్ని ఏర్పరచుకుని కామ్రాన్ అనుకున్న దానికన్నా ఎక్కువ కాలం హుమాయూన్ సేనలను నిలువరించగలిగాడు. ఆఖరికి హుమాయూన్ సైనికులు వలయాన్ని ఛేదించుకుని కామ్రాన్ భవనంకేసి భీకరంగా ముందుకు దూసుకు పోసాగారు. దానికి ముందుగా బ్రహ్మాండమైన ఫిరంగి కదులుతోంది. హుమాయూన్ తమ్ముడిపట్ల సహనం కోల్పో



యాడు. మొదట భవనం బురుజును పేల్చివేయమని ఆజ్ఞాపించాడు. దట్టించబడిన ఫిరంగి దానికి తగ్గట్టు గురి చేయబడింది. అయితే, ఫిరంగిని పేల్చడానికి ముందు ఒక వింత దృశ్యం హుమాయూన్ కంటబడింది. ఒక పసివాడు బురుజుకు బంధించబడి ఉన్నాడు. ఆ మారణాయుధాన్ని పేల్చకండి అంటూ ఒక స్త్రీ అదే పనిగా చేతులు ఊపుతూ కనిపించింది. హుమాయూన్ తృటిలో ఫిరంగి దిశను మార్చగలగడంతో గుండు భవనం బురుజుకు బదులు ప్రహారీ గోడకు తగిలి ఛిన్నాభిన్నమయింది. కామ్రాన్ ఓటమి భయంతో భవనం నుంచి పారిపోయాడు. కోట హుమాయూన్ అధీనమయింది.



భవనం బురుజుకు బంధించబడ్డ పసివాడు వేరెవరో కాదు; అక్బర్. సాహసోపేతమైన ఆ పథకానికి పూనుకున్న స్త్రీ దాది మాహం అంగా. దాని ద్వారా అక్బర్‌ను మాత్రమే కాకుండా కోటలోపలి వారందరినీ రక్షించకలిగింది.

యేడాది బిడ్డగా ఉన్నప్పుడు హామీదా బాను తన కొడుకును దాది సంరక్షణలో వదిలింది. ఆ సమయంలో కూడా ఆమె పలువురు స్త్రీల మధ్య కూర్చున్నప్పుడు అక్బర్ తిన్నగా వెళ్ళి తల్లి ఒడిలోకి చేరాడని చెబుతారు.

బలవంతుడైన షేర్షా మరణంతో హుమాయూన్ తన హిందూస్థాన్ సామ్రాజ్యాన్ని సునాయాసంగా కైవసం చేసుకోగలిగాడు. అప్పుడాయన సాహిత్యాధ్యయనానికి ఆసక్తి కనబరచాడు. ఇతర కళల మీదికి దృష్టిని సారించాడు. ఒక నాటి సాయంకాలం మేడమెట్లపై నుంచి జారి కింద పడడంతో తీవ్ర గాయానికి లోనయ్యాడు.

ఆయన కోలుకోవడం దుర్లభమని పానిపట్టులోని వివేకి అయిన మంత్రి బైరాంఖాన్‌కు తెలియజేయబడింది. వెంటనే తిరిగివచ్చిన మంత్రి నకిలీ హుమాయూన్‌ను ఉపయోగించి అక్బర్‌కు చక్రవర్తిగా పట్టాభిషేకం జరిపించాడు. ఆ పిమ్మటే హుమాయూన్ మరణించాడన్న విషయం ప్రకటించబడింది. ఆ విధంగా సింహాసనం పరులవశం కావడాన్ని బైరాంఖాన్ అడ్డుకున్నాడు. అప్పుడు అక్బర్ వయసు పధ్నాలుగేళ్ళే. ఇరువురికీ అభిప్రాయ భేదాలు ఏర్పడినప్పటికీ క్రమేణా ఆయన బైరాంఖాన్ తనమీద ఉంచిన విశ్వాసాన్ని నిలబెట్టుకున్నాడు!

బీర్బల్ కథలు : 15



# కుండనిండా వివేకం!

రాజా వీర్‌సింగ్ ఒక సంస్థానాధిపతి. ఆయన మొగలుల ఆధిపత్యానికి నిరభ్యంతరంగా తలఒగ్గి సామంతుడిగా ఉండడానికి సంతృప్తి చెందాడు. ఆ విధంగా ఆయన తన ప్రజలకు శాంతిని సమకూర్చాడు. మామూలుగా ప్రజలు కోరుకునేవి శాంతి భద్రతలూ, తిండీబట్టా సంపాదించుకునే మార్గాలే గనక, అవి లభించడంతో రోజులు ఒడిదుడుకులు లేకుండా గడిచిపోతున్నాయి.

అయితే, కొందరు యువకులకు ఈ స్థితి నచ్చలేదు. అనుభవజ్ఞుడైన రాజు వాళ్ళ మీద ఎలాంటి చర్యలూ తీసుకోలేదు. పైగా, వాళ్ళు సంపూర్ణ స్వాతంత్ర్యం సమస్యను లేవనెత్తినప్పుడల్లా వాళ్ళను పిలిచి చర్చలు జరిపేవాడు. ''మీ అందరిలాగే నాకూ సంపూర్ణ స్వాతంత్ర్యం పట్ల ప్రేమ ఉన్నది. అయినా, మొగలులను ఎదుర్కొనే శక్తి మనకు లేదే! ఎదురు తిరిగితే ఓటమి తప్పదు. మనలో పలువురు జైలు పాలుకావడం; మరి కొందరు ఉరిశిక్షకు లోనుకావడం ఖాయం. పరిస్థితిని అర్థం చేసుకోండి. ఇప్పుడు మామూలు ప్రజలకు కావలసిన పాఠశాలలకు, వైద్యశాలలకు కొరత లేదు. ఆహారం కొరత లేదు. రాకపోకలకు ఎలాంటి ఇబ్బంది లేదు. శాంతి భద్రతల సమస్య లేదు. ఇంతకు మించి ఏం కావాలి చెప్పండి,'' అని నచ్చచెప్పడానికి ప్రయత్నించేవాడు.

అలా చర్చ జరుగుతూన్న ఒక సందర్భంలో కొందరు యువకులకు రాజుగారి వాదం నచ్చలేదు. ''వివేకవంతులు అసాధ్యాలను సుసాధ్యం చేయగలరు!'' అన్నాడు ఒక యువకుడు ఆవేశంగా.

''అలాంటి వివేకవంతులు మనలో ఉండాలికదా?'' అన్నాడు రాజు.

''కావలసినంత మంది ఉన్నారు,'' అన్నాడు మరో యువకుడు.

''అది నాకూ తెలుసు. అయినా అక్బర్ ఆస్థానంలో మనకన్నా, ప్రపంచంలో అందరి కన్నా కూడా తెలివైనవాళ్ళు ఉన్నారన్న సంగతి

మరిచిపోకూడదు,'' అని కొంతసేపు మౌనం వహించిన రాజు, ''ఆ సంగతి తెలుసుకోవడానికి మీరేదైనా పరీక్ష పెట్టాలంటే నేను సహకరించడానికి సంసిద్ధంగా ఉన్నాను,'' అన్నాడు నిర్లిప్తంగా.

అందుకు యువకులు కొన్ని రోజులు అవకాశం కావాలన్నారు. రాజు సరేనన్నాడు.

ఒక వారం రోజుల తరవాత రాజును దర్శించడానికి వచ్చిన ఒక యువకుడు, ఒక కుండ నిండా వివేకాన్ని పంపమని అక్బర్ చక్రవర్తికి విన్నవించమని రాజును కోరాడు.

''ఏమిటీ! కుండనిండా వివేకమా? వివేకాన్ని కుండలో ఎలా నింపగలం?'' అంటూ కనుబొమలు ముడిచాడు రాజు.

''అది అసాధ్యమని తమరు భావిస్తున్నారు. అంతేకదా మహారాజా,'' అని అడిగాడు యువకుడు.

''అవును,'' అన్నాడు రాజు.

''అసాధ్యాన్ని సుసాధ్యం చేసేవాడే నిజమైన వివేకి. అసాధ్యమైన మన కోరికకు మొగలుల ఆస్థానం నుంచి సరైన సమాధానం వచ్చినట్టయితే, సంపూర్ణ స్వతంత్రం గురించిన మన కోరికను వదులుకుందాం,'' అన్నాడు యువకుడు.

''అదేం సమస్య కాదు. అయినా, అక్బర్ ఆస్థానం నుంచి సరైన సమాధానం పంపడంతోపాటు, మరేదైనా నిబంధన విధించినా, మన పథకాన్ని గ్రహించి క్షమాపణలు కోరుతూ జరిమానా విధించినా ఆశ్చర్యపోనక్కర లేదు. ఆ సంగతి కూడా ఆలోచించాలి కదా?'' అన్నాడు రాజు.

''ధైర్యంగా కార్యాచరణకు దిగేవారినే విజయం వరిస్తుంది,'' అన్నాడు యువకుడు.

''విజయావకాశం ఉందని తెలిసినప్పుడే కదా కార్యాచరణకు దిగాలి,'' అని అడ్డుపడ్డాడు రాజు.

''మొదట ప్రయత్నించి చూడండి ప్రభూ! ఓటమి భయం చూపి మమ్మల్ని మరీ పిరికి పందల్ని చేయకండి,'' అన్నాడు యువకుడు వినయంగా.

''సరే. నీ ఇష్టాను సారమే చేస్తాను,'' అని యువకుడికి మాట ఇచ్చిన రాజు అక్బర్ చక్రవర్తి వద్దకు దూతను పంపాడు.

కొలువు దీరి ఉన్న అక్బర్ చక్రవర్తిని దర్శించిన దూత, ఆయనకు తమ రాజు పంపిన విలువైన కానుకలను వినయంగా సమర్పించాడు.



''రాజా వీర్‌సింగ్ క్షేమమే కదా?'' అని అడిగాడు అక్బర్.

''తమ నీడలో నిశ్చింతగా ఉన్నారు ఆలంపనా!'' అన్నాడు దూత.

''కానుకలకు కృతజ్ఞతలు. మరేదైనా సందేశం పంపాడా?'' అని అడిగాడు అక్బర్.

''ఆలంపనా! తమ ఆస్థానంలో పలువురు సుప్రసిద్ధులైన వివేక సంపన్నులు ఉన్నారు కదా? వారి నుంచి ఒక కుండ నిండా వివేకం తీసుకురమన్నారు ప్రభూ,'' అన్నాడు దూత మామూలుగా.

కుండలో రకరకాల వస్తువులు పెట్టవచ్చు. వివేకాన్ని ఎలా నింపడం! కుండలో వివేకం గురించి ఇంతవరకు ఎవరూ విన్న పాపాన కూడా పోలేదే! వివేకవంతులకు తెలివి తలలో ఉంటుంది. కుండలో కాదుకదా!

చక్రవర్తి ఏమాత్రం విచార పడలేదు. తమ ఆస్థానంలోని మేధావులకు కుండలో వివేకాన్ని నింపడం ఎలాగో తప్పక తెలియవస్తుందన్న నమ్మకంతో, ''ఒక నెలలోగా కుండ నిండా వివేకాన్ని పంపగలనని మీ రాజుకు చెప్పు,'' అన్నాడు.



''తమ దయకు కృతజ్ఞతలు ఆలంపనా! మీ సామంతుగా ఉన్న మా రాజు మహా భాగ్యశాలి!'' అంటూ వంగి నమస్కరించి దూత అక్కడి నుంచి బయలుదేరాడు.

ఆ తరవాత అక్బర్ సభికులను ఉద్దేశించి, ''ఆ రాజు విన్నపం విన్నారు కదా?'' అని అడిగాడు.

''సాధ్యం కాని దానిని అడుగుతున్నాడు,'' అన్నాడు వృద్ధుడైన ఒక సభికుడు.

''సాధ్యం చెయ్యండి, మరి,'' అంటూ అక్బర్ అతడి నోరు మూయించాడు.

చక్రవర్తి ఆగ్రహంతో ఉన్నాడని గ్రహించి మిగిలిన సభికులు మౌనంగా తలలు వంచుకున్నారు.

''ప్రభువులు పక్షం రోజులు అవకాశం ఇచ్చారంటే కుండ నిండుగా వివేకం పట్టుకు రాగలను,'' అంటూ లేచినిలబడ్డాడు బీర్బల్.

''తప్పకుండా తీసుకు రాగలవా?'' అని అడిగాడు అక్బర్.

''ప్రభువులకు ఇచ్చిన మాట ఇంతవరకు ఎన్నడూ తప్పి ఎరుగను!'' అన్నాడు బీర్బల్.

''భగవంతుడికి కృతజ్ఞతలు! ఆస్థానంలో నిజమైన వివేకి ఒక్కడైనా ఉన్నాడు,'' అంటూ అక్బర్ తక్కిన సభికుల కేసి తిరిగి, ''మహా, మహా మేధా

వులు!'' అన్నాడు హేళనగా. సభికులు అవమానంతో కుంచించుకు పోయినప్పటికీ, బీర్బల్ కుండ నిండా వివేకం ఎలా తేగలడు? తప్పక తేలేడు అని ఊరట చెందారు.

పెందలాడే ఇల్లు చేరిన బీర్బల్ నవ్వుతూ ఎదురువచ్చిన భార్యతో కాస్సేపు పిచ్చాపాటీ మాట్లాడాడు. ఆ తరవాత కూర పాదులున్న ఇంటి వెనక పెరట్లోకి వెళ్ళాడు. గుమ్మడి పాదులో చాలా గుమ్మడి కాయలు కనిపించాయి. పక్షం రోజుల్లో పెద్దది కాగల ఒక చిన్న గుమ్మడి పిందెను చూసి తనలోతాను నవ్వుకున్నాడు. వెంటనే ఇంట్లోకి వెళ్ళి పెద్ద కుండతో తిరిగి వచ్చాడు. తీగకొసతో గుమ్మడి పిందెను ఎత్తి జాగ్రత్తగా కుండలోకి వదిలి, కుండను కదలకుండా అమర్చాడు. ''పని పూర్తయింది,'' అని మనసులో మురిసిపోతూ భార్యను పిలిచి, కుండను అసలు కదిలించకూడదని చెప్పాడు.

బీర్బల్ రోజూ వెళ్ళి గుమ్మడి కాయను చూడసాగాడు. అది రోజు రోజుకూ పెద్దది కాసాగింది. పది రోజుల తరవాత కుండ నిండుగా గుమ్మడికాయ పెరిగింది. బీర్బల్ చిన్న కత్తితో కాయ తొడిమను కత్తిరించి, కుండ మీద మూతపెట్టి జాగ్రత్తగా తీసుకుని చక్రవర్తి సమక్షానికి బయలుద్దేరాడు.

''షహేన్‌షా! ఇదిగో కుండనిండా వివేకం తీసుకువచ్చాను. రేపటికల్లా అక్కడికి చేరే విధంగా రాజా వీర్‌సింగ్‌కు పంపండి,'' అన్నాడు బీర్బల్.

## మన దేశం క్విజ్

ఈ నెల క్విజ్ కొన్ని చారిత్రక ఘట్టాలకూ, వ్యక్తులకూ సంబంధించినది.



1. మన దేశంలోని ప్రథమ పోర్చుగీసు వైస్రాయ్ ఎవరు?
2. జహాంగీర్ చక్రవర్తినుంచి వర్తకహక్కులు పొందిన ఆంగ్లేయుడు ఎవరు?
3. శ్రీలంకకు బౌద్ధమత ప్రచారంకోసం తన కుమారుణ్ణీ, కుమార్తెనూ, పంపిన భారత చక్రవర్తి ఎవరు? వారి పేర్లేమిటి?
4. భారతదేశం మీదికి దండెత్తివచ్చి సుప్రసిద్ధ మయూర సింహాసనాన్ని పట్టుకుపోయిన పర్షియా రాజు ఎవరు?
5. 1398లో భారతదేశంపై మంగోలు దురాక్రమణ జరిగింది. దురాక్రమణ జరిపిన రాజు ఎవరు?
6. ఔరంగజేబు ముస్లిమేతరులపై విధించిన పన్ను పేరేమిటి?
7. భారతదేశం స్వాతంత్ర్యం పొందాక గవర్నర్ - జనరల్ ఎవరు?
8. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం జరిగినప్పుడు ఉన్న మొగల్ చక్రవర్తి ఎవరు?
9. మార్కోపోలో ఎప్పుడు భారతదేశానికి వచ్చాడు?
10. భారతదేశ తొలి మహిళా పాలకులు ఎవరు?

(సమాధానాలు 74వ పేజీలో)

''ఇందులో నిజంగానే వివేకం ఉన్నదా?'' అని అడిగాడు అక్బర్.

''ఉన్నది, ప్రభూ! కుండను పగలగొట్ట కుండా, దానికి ఏమాత్రం హాని కలక్కుండా వివేకాన్ని అందులోంచి పదిలంగా వెలుపలికి తీసుకోవాలని వీర్‌సింగ్‌కు తెలియ జేయండి. తీసుకున్నాక ఉన్నది ఉన్నట్టు కుండను మనకు తిప్పి పంపాలి. కుండ పగిలిందో దాని ధర పదివేల మొహరీలు చెల్లించాలి,'' అన్నాడు బీర్బల్.

''మట్టికుండకా?'' అని ఆశ్చర్యపోయాడు అక్బర్.

''అందులో అమూల్యమైన వివేకం ఉన్నది కదా? అందుకే,'' అన్నాడు బీర్బల్.

బీర్బల్ మాటల్లో ఏదో మర్మం ఉందని గ్రహించిన అక్బర్, అతడు చెప్పినట్టు కుండను వీర్‌సింగ్‌కు పంపేసి, ''నీ పథకం ఏమిటో ఇప్పుడు చెప్పు,'' అని అడిగాడు.

బీర్బల్ తను చేసిన పనిని వివరించి, ''కుండను పగలగొట్టకుండా రాజు గుమ్మడి కాయను వెలుపలికి తీయలేడు. అది తప్పక అలాగే మనకు తిరిగి వస్తుంది,'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

''మహా ఘటికుడివి బీర్బల్,'' అంటూ బిగ్గరగా నవ్వాడు అక్బర్.

అక్కడ కుండను అందుకున్న రాజా వీర్ సింగ్ చక్రవర్తి నిబంధనలు కూడా విన్నాడు. కుండనిండా గుమ్మడికాయ ఉండడం చూశాడు. కుండను పగలగొట్టకుండా దాన్ని అలాగే వెలికి తీయడం అసాధ్యం అని గ్రహించాడు. అపరాధం చేశామన్న జ్ఞానోదయం కలిగింది. యువకులను పిలిచి కుండను చూపి చక్ర వర్తి నిబంధనలను వినిపించాడు.

''మీమాట విన్నాను. ఇప్పుడు రాజుకు చెల్లించనున్న పదివేల మొహరీల నష్టాన్ని భర్తీ చేయడానికి మీరు మరింత శ్రమించకతప్పదు,'' అని చెప్పి వాళ్ళను పంపేశాడు.

వీర్‌సింగ్ ఇచ్చిన పదివేల మొహరీలతో తిరిగివచ్చిన దూతను చూసి, ''ఇప్పుడు రాజు గారి ఖజానాకు పదివేల మొహరీలు అదనంగా చేరాయి,'' అన్నాడు బీర్బల్.

''వాటిలో సగం నీకు చేరాలి బీర్బల్,'' అంటూ మెచ్చుకుని చిన్నగా నవ్వాడు అక్బర్ చక్రవర్తి.

-(ఆర్.కె. మూర్తి)



## తమిళనాడు జానపద కథ

# కవిత్వం బరువు

దక్షిణాదిలోని ఒక చిన్న రాజ్యాన్ని రామదురైై అనే రాజు పాలించేవాడు. ఆయన చాలా ధైర్యవంతుడు; ధైర్యవంతులను ప్రోత్సహించేవాడు. ఇరుగుపొరుగు రాజ్యాలను జయించి తన రాజ్యాన్ని విస్తరించాలన్నదే ఆయన ఏకైక లక్ష్యం. తన లక్ష్యసాధనకు ఉపయోగపడని కళలన్నా, సాహిత్యమన్నా రామదురైకి చిన్నచూపు. అందువల్ల కళాపోషణపట్ల ఆసక్తి కనబరచేవాడు కాడు. పైగా, ఆయనకు కవిత్వమంటే పరమ చిరాకు. కవిత్వరచన, ఆలాపన వల్ల సమయం వృథా అన్నది ఆయన దృఢమైన అభిప్రాయం.

కవులు తరచూ రాజు అపహాస్యానికీ, అవమానానికీ గురయ్యేవారు. ఒక్కొక్కసారి కవిత్వం వినిపిస్తామని కవులు ఎవరైనా వస్తే, మొదట సాదరంగా ఆహ్వానించి చదవమని ఆదేశించేవాడు. తీరా విన్నాక త్రాసును తెప్పించి ఒక పళ్ళెంలో కవిత్వం రాసి ఉన్న కాగితం ఉంచి, మరో పళ్ళెంలో దాని ఎత్తు నకిలీ బంగారం తూచి ఇచ్చేవాడు. కాగితాలు మరీ తేలికగా ఉండడంతోనూ, ఇచ్చిన బంగారం సైతం నకిలీ కావడంతోనూ కవులు చెప్పరాని ఆశాభంగంతో తిరిగి వెళ్ళేవారు.

కవిత్వానికి ఆదరణ కొరవడడంతో రామదురై ఆస్థానానికి వచ్చే కవుల సంఖ్య రోజురోజుకూ తగ్గిపోసాగింది. ఇక కవిత్వం కూడు పెట్టబోదని గ్రహించిన కవులు జీవనోపాధికి వేర్వేరు మార్గాలు వెతుక్కోసాగారు. దాంతో రాజు వద్దకు కవిత్వం వినిపిస్తానని వచ్చే కవి అన్నవాడు లేకుండా పోయాడు.

రాజ్యంలోని ఒక మారుమూల గ్రామంలో శివనేసన్ అనే పండితుడు ఉండేవాడు. ఆయన పిల్లలకు పగటిపూట చదువునేర్పుతూ, సాయంకాలాలలో పెద్దలకు కథలు చెబుతూ, వాళ్ళు ఇచ్చింది పుచ్చుకుని కాలం గడిపేవాడు. గ్రామస్థులకు కథలు చెప్పేప్పుడు శివనేసన్ నోటి నుంచి సహజంగా కవిత్వం జాలువారేది. దాన్ని విని గ్రామస్థులు అమితానందం చెందేవారు.



ఆయన కవిత్వం విన్న కొందరు రాజుకు వినిపిస్తే ఘనంగా సన్మానం లభిస్తుందని సలహా ఇచ్చారు. అయితే, శివనేసన్ అందుకు అసలు సమ్మతించలేదు. కవులను అవమానించే రాజు దగ్గరికి వెళ్ళనని చెప్పేశాడు.

ఇలా ఉండగా ఒకనాడు కొలువుదీరిన రామదురై, ''మన రాజ్యంలో కవులమని చెప్పుకు తిరిగే మూర్ఖుల బెడద లేకుండా చేసినందుకు చాలా సంతోషంగా ఉన్నది. ఇప్పుడెంతో హాయిగా ఉన్నది కదా?'' అన్నాడు గొప్పగా.

ఎక్కువ మంది సభికులు, ''అవును, అవును,'' అంటూ రాజు మాటకు వంతపాడారు. అయితే, ప్రధాన మంత్రి మాత్రం లేచి నిలబడి, ''ప్రభువులు క్షమించాలి. మన రాజ్యం దక్షిణ సరిహద్దులోని ఒక గ్రామంలో శివనేసన్ అనే కవి తన గ్రామస్థులకు కవిత్వం వినిపించి అలరిస్తున్నాడని విన్నాను,'' అన్నాడు.

ఆ మాటకు దిగ్భ్రాంతి చెందిన రాజు, ''ఆ కవి గ్రామస్థుల మధ్య అంత పేరున్న వాడైతే కవిత్వం వినిపించడానికి నావద్దకు ఎందుకు రాలేదు?'' అని అడిగాడు.

''ఈ మాట అంటున్నందుకు ప్రభువులు మన్నించాలి. తమ సమక్షంలో కవిత్వం వినిపించడానికి అతడు ఆసక్తి కనబరచడం లేదట!'' అన్నాడు మంత్రి వినయంగా.

''అలాగా! వెంటనే కొందరు భటులను పంపి అతణ్ణి ఇక్కడికి పిలిపించు,'' అని ఆజ్ఞాపించాడు రాజు.

భటులు అప్పటికప్పుడే బయలుదేరి వెళ్ళి శివనేసన్‌ను కలుసుకుని, ''రాజుగారు తమను వెంటబెట్టుకు రమ్మన్నారు,'' అంటూ మంత్రి ఇచ్చిన లేఖను అందించారు.

ఆశ్చర్యంతో లేఖను అందుకుని చదివిన శివనేసన్, రాజాగ్రహానికి గురి కావడం క్షేమం కాదు గనక, భటుల వెంట రాజాస్థానానికి బయలుదేరాడు. ఆయన్ను చూడగానే రాజు సాదరంతో ఆహ్వానించి, ''తమరేదో గొప్పగా కవిత్వం రాస్తారనీ, గ్రామస్థులకు వినిపిస్తారనీ తెలియవచ్చింది. ఇన్నాళ్ళు నా దగ్గరికి రాకపోవడం ఆశ్చర్యం కలిగిస్తోంది. అయినా అందుకు కారణం అడగడం లేదు. ఇప్పుడు వినిపించండి, వింటాను,'' అన్నాడు.



ఆ మాటలు శివనేసన్‌కు ఆశ్చర్యం కలిగించాయి. ఆయన కొంతసేపు మౌనంగా ఆలోచించి, ''ప్రభూ! తమకు నా కవిత్వం వినాలన్న కోరిక ఉన్నట్టు నాకు తెలియదు. ఉన్న పళాన బయలుదేరడం వల్ల రాసిన కవితలను వెంట తీసుకు రాలేక పోయాను. అందువల్ల తమరు కొంత సమయం కేటాయించారంటే తమకోసం

ప్రత్యేకంగా కవితలు లిఖించి వినిపించగలను,'' అన్నాడు వినయంగా.

''అలాగే! అందుకు ఎంత సమయం కావాలి?'' అని అడిగాడు రాజు.

''రెండు వారాలు చాలు ప్రభూ! అయితే, ఒక చిన్న విన్నపం,'' అన్నాడు శివనేసన్.

''ఏమిటది?'' అని అడిగాడు రాజు.

''నేను ఆస్థానంలో కవిత్వం చదివేప్పుడు నన్నెవరూ చూడకూడదు. తెరచాటునుంచి మాత్రమే చదవగలను,'' అన్నాడు శివనేసన్.

''అంతే కదా! అలాగే కానివ్వు,'' అన్నాడు రాజు.

శివనేసన్ రాజు అనుమతి పుచ్చుకుని వెళ్ళి పోయాడు. కవిత్వం వినిపించడానికి రోజును నిర్ణయించారు. ఆ రోజున రాజుకు ఎదుట శివనేసన్ కూర్చుని కవిత్వం వినిపించడానికి వీలుగా, ప్రత్యేక వేదికను ఏర్పాటు చేశారు. అతడు సభికులకు కనిపించకుండా నాలుగు వైపులా తెరలు వేలాడదీశారు.

శివనేసన్ సభకు రావడానికి ముందు ఆయన మనుషులు నలుగురు నాలుగు బరువైన పెట్టెలను తెచ్చి, శివనేసన్‌కు నిర్దేశించిన వేదిక మీద ఉంచి, వచ్చి సభికుల మధ్య కూర్చు న్నారు. ఆ తరవాత శివనేసన్ వచ్చి రాజుకు నమస్కరించి, ''తమరు అనుమతిస్తే కవిత్వం వినిపించగలను,'' అన్నాడు.

రాజు తలపంకించాడు. తెరల మధ్యకు వెళ్ళిన శివనేసన్ మృదుమధురమైన కంఠ స్వరంతో ఒక్కొక్క పద్యంగా చదివి వినిపించ సాగాడు. మొదటి పద్యం రాజ్యాన్ని కీర్తిస్తూ చదివాడు. శివనేసన్ రాజునూ, ఆయన ఉన్నత



మైన వంశాన్నీ పొగుడుతూ రెండవ పద్యం చదువుతూంటే రాజు ఆనందంతో చప్పట్లు చరిచాడు. సభలో హర్షధ్వానాలు వినిపించాయి. ఆ తరవాత రాజు రామదురై ధర్మపాలనలో ప్రజలు అనుభవిస్తున్న భోగభాగ్యాల గురించి వర్ణించాడు. దానిని విన్న సభామంటపంలోని సాధారణ ప్రజలు ఆనందంతో ఉప్పొంగిపోయి హర్షధ్వానాలు చేశారు. రాజూ, ప్రజలూ ఎలాంటి కొరతా లేకుండా సుఖశాంతులతో జీవించేలా దీవించమని దేవతలను ప్రార్థించే భావంతో చివరి పద్యం చదివి వినిపించాడు.

సభికుల కరతాళ ధ్వనులు సభాప్రాంగణం నాలుగు వైపుల నుంచీ ప్రతిధ్వనిస్తూండగా శివనేసన్, తెరచాటునుంచి బయటకు వచ్చి, రాజుకు వినయంగా చేతులు జోడించి నిలబడ్డాడు.

పరమానందం చెందిన రాజు, ''తమ కవిత్వం



అద్భుతం కవివర్యా! అభినందనలు! ఇక మన సంప్రదాయానుసారం తమరిని సత్కరించాలి. ఏవీ కవిత్వం రాసిన పత్రాలు,'' అన్నాడు.

శివనేసన్ తన వెంట వచ్చిన మనుషుల కేసి చూశాడు. వాళ్ళు ఆయన కూర్చున్న తెరల వేదిక మీదికి వెళ్ళి అక్కడి నాలుగు పెట్టెలను తెచ్చి సభామధ్యంలో పెట్టారు. శివనేసన్ ఒక్కొక్క పెట్టెగా తెరిచి వాటిలోని చలవరాతి పలకలను తీసి బయట పెట్టి, ''ప్రభూ! నా కవిత్వం నాతో అంతరించి పోకుండా భావి తరాలకు కూడా పదిలంగా అందించాలన్న ఆశయంతో చలవ రాతి మీద చెక్కించాను. వాటి బరువుకు సరి పడా బహుమతులివ్వడం తమకు ఆనంద కరమే కదా!'' అన్నాడు.

అంతలోనే అక్కడికి త్రాసు, బంగారు నాణాలు, ఆభరణాలు తీసుకు రాబడ్డాయి. శివనేసన్ పన్నిన ఉపాయం రాజు గ్రహించాడు కాని, కవిత్వం బరువుకు బరువు బంగారం ఇస్తానన్న మాట తప్పలేడు గనక, చలవరాతి పలకల బరువుకు సమానంగా బంగారం తూచి ఇవ్వక తప్పలేదు. రాజు ఏమీ అనలేక ఆగ్రహంతో ఉరుముతూ చూడసాగాడు.

అప్పుడు శివనేసన్ రాజుకేసి తిరిగి, ''ప్రభూ! నాకెలాంటి ధనాశా లేదు. పైగా నా కవిత్వాన్ని అమ్మడం నాకేమాత్రం సమ్మతం కాదు. ఈ బంగారు ఆభరణాలనూ, నాణాలనూ తమరే తీసుకోండి. దయచేసి భవిష్యత్తులో కవులన్నూ, కవిత్వాన్నీ అవమానించకండి, అంతేచాలు,'' అని చెప్పి వినయంగా నమస్కరించి సభ నుంచి వెలుపలికి నడిచాడు.

## చందమామ క్విజ్ - 8 సమాధానాలు

1. హిమాచల్ ప్రదేశ్ కాంగ్రా లోయ 2. రాజా రవివర్మ 3. ఆధునిక భారతీయ చిత్రకళకు మార్గదర్శకులు 4. న్యూ ఢిల్లీలో ; స్వాతంత్ర్యానికి పూర్వం 1945లో 5. ఎలిఫెంటా గుహలలో 6. పల్లవులు 7. ఫ్రెంచి శిల్పకారుడు లీ కార్బూసియర్ 8. ఆగ్రా సమీపంలోని ఫతేపూర్ సిక్రిలో; అక్బర్ చక్రవర్తి

## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు - 14

# అన్నకు తగ్గ తమ్ముడు!

''వీరపాండ్య కట్టబొమ్మన్‌ను ఓడిస్తే తప్ప బ్రిటిష్ పాలనను నెలకొల్పడం అసాధ్యం. సైనికబలంతోనే అతణ్ణి లొంగదీసుకోవాలి,'' అన్నాడు హడలిపోయిన కలెక్టర్ జాక్సన్. అయితే, దాదాపు రెండు వందల సంవత్సరాలకు పూర్వం పరాయి పాలనకు మొట్ట మొదటి సారిగా ఎదురు తిరిగిన ఆ యోధుడు శత్రువులకు తల వంచ లేదు. ''ఎక్కడో పరాయిదేశంనుంచి వ్యాపారంకోసం వచ్చిన తెల్లవారా పాంచాలన్ కురిచ్చి పాలకుణ్ణి బెదిరించడం?'' అంటూ నిప్పులు కురిపించాడు వీరపాండ్య కట్టబొమ్మన్.

గత సంచికలో మీరు చదివినట్టు ఆ దేశ భక్తుణ్ణి స్వదేశస్థులే ద్రోహ చింతనతో బ్రిటిష్



పాలకులకు పట్టి ఇచ్చారు. ఉరిశిక్ష నెరవేరడానికి ముందు తమ్ముడు ఊమైదురైని చివరి సారిగా చూడాలని కట్టబొమ్మన్ ఆశించాడు కాని కఠినాత్ములైన ఆంగ్లేయులు అందుకు అంగీకరించలేదు. ''తమ్ముడు కలవాడు శత్రువులకు భయపడడు,'' అని గర్జిస్తూ ఆయన ఉరితాడును అందుకున్నాడు. అది 1799 అక్టోబర్ 17వ తేదీ.

ఊమైదురై కూడా అసమాన ధైర్యసాహసాలుగల వీరుడు. కట్టబొమ్మన్‌ను హతమార్చి అతడి చిన్న రాజ్యాన్ని వశపరచుకున్నందుకూ, ఊమైదురైని చెరసాలలో బంధించినందుకూ ఆంగ్లేయ పాలకులు పరమానందం చెందారు. అంతటితో ఊరుకోకుండా పాంచాలన్‌కురిచ్చి కోటను నేలమట్టం చేశారు. కోటలోని సంపదలను సైనికులు దోచుకున్నారు. తమకు నిద్ర లేకుండా చేసిన ఒక శత్రువును తుద ముట్టించినందుకు బ్రిటిష్ పాలకులు హాయిగా ఊపిరి పీల్చుకున్నారు.

అయితే, లోలోపల నిశ్శబ్దంగా రగులుతూన్న తిరుగుబాటుజ్వాల గురించి వారికి తెలియలేదు. వీరుడైన తమ పాలకుణ్ణి హతమార్చినందుకు పగ సాధించాలని ప్రజలు ఆగ్రహంతో ఎదురు చూడసాగారు. సాహస వీరులైన అసంఖ్యాక యువకులు బ్రిటిష్ పాలకుల దుర్మార్గాన్ని అంతు చూడాలను కున్నారు. శత్రువుల చెరసాలలో ఉన్న ఊమై

దుర్రై బయటపడితేనే అది సాధ్యం కాగలదు. కాళ్ళు చేతులకు ఇనుపసంకెళ్ళు తగిలించి మరీ అతణ్ణి పాళయం కోట్టై చెరసాలలో బంధించి ఉన్నారు! అలాంటప్పుడు అతడూ, అతడి అనుచరులూ ఎలా తప్పించుకోగలరు?

ఇలాగే యేడాదిన్నర గడిచి పోయింది. అయితే, బందీగా ఉన్న యువరాజు విశ్వాసాన్ని కోల్పోలేదు. వెలుపల ఉన్న విప్లవకారులతో రహస్యంగా సంబంధం ఏర్పరచుకుని పకట్బందీగా ఒక పథకాన్ని రూపొందించాడు. దానిని గురించి ఏమాత్రం తెలియని ఆంగ్లేయులు మాత్రం విజయోత్సాహంతోనే కాలం గడపసాగారు.

1801 ఫిబ్రవరి 2వ తేదీ ఎప్పటిలాగే సూర్యోదయమయింది. హఠాత్తుగా వందలాది మంది కట్టెపుల్లల మోపులు, గడ్డిమోపులు తలల పైకెత్తుకుని పాళయంకోట్టైకి అమ్మడానికి వచ్చారు. ధర విపరీతంగా చెప్పడంతో వాటిని ఒక్కరూ కొన్న పాపాన పోలేదు. ఉన్నట్టుండి వచ్చినవారు వచ్చినట్టు ఎటో వెళ్ళిపోయారు. వారితో పాటు పలువురు సన్యాసులు మరోవైపు భజన కీర్తనలు ఆలపిస్తూ బిచ్చమెత్తడానికి వచ్చారు. ఇంకా మరెందరో ప్రయాణీకులు సత్రాలలో దిగారు. అయితే, ఎవరూ వారిని అనుమానించి ప్రశ్నించలేదు.

సూర్యుడు అస్తమించాడు. ఆ ప్రాంతానికి బాధ్యత వహించే మేజర్ మెకాలే స్థానికంగా ఉంటూన్న ఆంగ్లేయ కుటుంబాలకు విందు ఏర్పాట్లు చేశాడు. ఆ క్షణం కోసమే ఎదురు చూస్తూన్న వింత వ్యాపారాలు, సన్యాసులు, ప్రయాణీకులు కట్టెలమోపులలో, గడ్డిమోపులలో దాచిన తుపాకులను, కత్తులను, కఠారులను అందుకుని ముందుకు ఉరికారు. కాపలా భటులను హతమార్చి కారాగారంలోకి జొరబడ్డారు. ఖైదీలను విడిపించారు. నినాదాలు చేస్తూ వీధుల గుండా పరుగుగులు తీసి చీకటిలో కలిసిపోయారు.

అక్కడినుంచి వాళ్ళు పాంచాలన్ కురిచ్చికి బయలుదేరారు. కాని శత్రు సైనిక దళాలు మార్గానికి అడ్డుపడి ఎదుర్కొన్నాయి. భయంకరమైన యుద్ధం జరిగింది. ఆఖరికి ధైర్యవంతులైన అనుచరులతో కలిసి ఊమైదుర్రై - కంపెనీ సేనలను చిత్తుచేసి గమ్యాన్ని చేరుకున్నాడు. ఉత్సాహంగా స్వాగతం పలికిన ప్రజలు ఆయన్ను తమ పాలకుడిగా ప్రకటించారు!

అయితే, నిన్న మొన్నటి దాకా ఎంతో గంభీరంగా కనిపించిన రాజభవనం ఇప్పుడు శత్రువుల దాడి కారణంగా శిథిలావస్థను చేరుకున్నది. అయినా ఆయన నిరుత్సాహపడలేదు. ఆయన పేరుకు మాత్రమే ఊమై (మూగ)



దురై. నిజానికి గొప్ప వక్తగా పేరుగాంచాడు. ఉత్సాహభరితమైన ఆయన విజ్ఞప్తి మేరకు ప్రజలు రాజభవన పునర్నిర్మాణానికి నడుం బిగించారు.

అదే సమయంలో, ఊమైదురై నాటకీయంగా తప్పించుకోవడం మేజర్ మెకాలేనూ, అతడి అధికారులనూ, తీరని దిగ్భ్రాంతికి గురి చేసింది. బలమైన సైన్యాన్ని సమకూర్చుకుని పాంచాలన్‌కురిచ్చికి చేరేలోగా అక్కడ బ్రహ్మాండమైన కొత్త కోటను చూసి, ''నమ్మ శక్యం కాలేదే! ఇంతలో ఇంత పెద్ద భవన నిర్మాణమా? మాయమంత్రాలు లేవు కదా!'' అని విస్తుపోయారు.

కొత్తరాజు ప్రజలలో నూతనోత్తేజాన్ని రగిలించి యుద్ధ ప్రాతిపదికలో కోటను పునర్నిర్మించాడని తెలియవచ్చింది. వేలాదిమంది పౌరులు రాత్రింబవళ్ళు నిర్విరామంగా పనిచేసి ఏడు రోజులలో భవన నిర్మాణం పూర్తి చేశారు!

ఈ అద్భుత కృత్యాన్ని మేజర్ మెకాలే, అతడి అధికారులు ఓ పట్టాన నమ్మలేక దాన్ని సమీపించడానికి సైతం వెనుకంజ వేశారు. పైగా, కోటలోపల వేలాదిమంది వీరులు శత్రువులపై విరుచుకు పడడానికి ఆయుధాలతో సిద్ధంగా ఉన్నారని కూడా తెలియవచ్చింది. దాంతో తిరోగమించడమే ఉత్తమమని బ్రిటిష్ సేనలు మెల్లగా వెనుదిరిగాయి. అయితే, మరి కొన్ని రోజులలోనే కంపెనీ సేనలు రెండవసారి కోట మీదికి దాడి జరిపాయిగాని, ఎంత ప్రయత్నించినప్పటికీ ఏమాత్రం ముందుకు చొచ్చుకు పోలేక పోయాయి.

కట్టబొమ్మన్‌కు తరవాత ఇప్పుడు మళ్ళీ తిరుగుబాటు తలెత్తడం బ్రిటిష్ అధికారులకు కునుకు లేకుండా చేసింది. యావత్ దేశాన్ని తమ అధికారం కిందికి తీసుకురావాలన్న తమ కాంక్షకు ఊమైదురై అడ్డుగా పరిణమించాడని భావించారు. కావాలంటే ఆయనతో సంధి, ఒడంబడిక కుదుర్చుకుని ఉండవచ్చు. అయినా, ఆయన్ను బంధించి, కోటను నాశపరచాలనే నిర్ణయించారు. ఆయుధాలతో పెద్ద సైన్యాన్ని సమీకరించుకుని కల్నల్ ఆగ్న్యూ నాయకత్వంలో పాంచాలన్‌కురిచ్చి కేసి నడిపించారు.

బ్రిటిష్ సేనలు కోటను చుట్టుముట్టాయి. ఒక్కరూ కోట లోపలికి వెళ్ళడంగాని, లోపలి నుంచి వెలుపలికి రావడం గాని సాధ్యం కాకుండా చేశాయి. ఆ సైనిక బలగాన్ని చూసి ఊమైదురై లొంగిపోక తప్పదని బ్రిటిష్ అధికారులు దృఢంగా విశ్వసించారు. అయినా, లొంగిపోయే సూచనలు ఏవీ కనిపించలేదు. ఊమైదురై, ఆయన అనుచరులు యుద్ధానికి మౌనంగా సన్నద్ధులయ్యారు. శత్రు సేనలు కోట గోడల చుట్టూ మోహరించాయి. రోజులు వారాలుగా, వారాలు నెలలుగా గడిచి పోతున్నాయిగాని, ఫిరంగి మోతలకు భయపడి



ఊమైదురై లొంగిపోలేదు. ఇంకా ఎంతకాలం వేచి చూడడం అని బ్రిటిష్ అధికారులు సహనం కోల్పోసాగారు.



అయితే, కోటలోపల ఆహార ధాన్యాలు, సరకులు అయి పోవడంతో లోపల ఉన్నవారు ఆకలికి గురి కావ లసి వచ్చింది. శత్రువులకు లొంగి పోవడం, లేదా అక్కడినుంచి తప్పించు కుని పారిపోవడం – ఈ రెండే ఊమైదురై ముందున్న మార్గాలు. రెండవ దాని వైపే ఆయన మొగ్గాడు.

అదొక చీకటి కమ్ముకున్న కాళరాత్రి. హఠా త్తుగా కోటద్వారాలు తెరుచుకున్నాయి. తుపా కులు పేల్చుతూ, కత్తులు తిప్పుతూ వీరులు వెలుపలికి దూసుకు వెళ్ళారు. ఏం జరుగు తున్నదీ శత్రుసేనలు గ్రహించేలోగా వీరులు దూరంగా వెళ్ళారు. కొందరు హతులయ్యారు. అయితే, నాయకుడు ఊమైదురై ఏమయ్యాడు? హతుడయ్యాడా? తప్పించుకున్నాడా? వారికి అంతుబట్టలేదు.

మరునాటి ఉదయం ఒక వృద్ధురాలు తన కొడుకును వెతుక్కుంటూ వెళ్ళి అతడు ఒక చెట్టుకింద క్షతగాత్రుడై పడి ఉండడం చూసింది. ఆమెను చూడగానే, ''అమ్మా, నన్ను కాపాడి ప్రయోజనం లేదు. అదిగో చూడు. దూరంలో మన రాజు తీవ్ర గాయాలతో బాధపడుతున్నాడు. ఆయన ప్రాణాలు కాపాడేవంటే ఆయన మన రాజ్యాన్ని కాపాడగలడు,'' అంటూ ఆ యువ కుడు శాశ్వతంగా కన్నుమూశాడు.

ఆ వీరమాత ఊమైదురైని తన గుడిసెకు మోసుకు వెళ్ళి, గాయాలకు కట్లుకట్టి పరి చర్యలు చేయసాగింది. వెతుక్కుంటూ వచ్చిన బ్రిటిష్ సైనికులు అది ఎవరని ప్రశ్నించి నప్పుడు, ''నా బిడ్డ వారం రోజులుగా మశూ చితో బాధ పడుతున్నాడు,'' అని ఆమె జవాబి చ్చింది. మశూచి అన్నమాట వినగానే సైనికులు హడలిపోయి అక్కడి నుంచి వెనుదిరిగి పారి పోయారు.

ఊమైదురై ఆ తరవాత శివగంగై మరుదు సోదరులతో కలిసి బ్రిటిష్ అణచివేతకు వ్యతి రేకంగా పోరాడాడు. అయితే, ఆఖరికి అంద రితో కలిసి బలి అయ్యాడు. అది 1801లో జరిగింది.

''తమ్ముడుకలవాడు శత్రువులకు భయ పడడు,'' అని వీరపాండ్య కట్టబొమ్మన్ చెప్పిన ఆఖరు మాట అక్షరాలా నిజమయింది. అన్న కట్టబొమ్మన్ వదిలిపెట్టిన చోటు నుంచి పోరాటాన్ని ఊమైదురై వీరోచితంగా కొనసాగించాడు. అన్నకు తగ్గ తమ్ముడనిపించుకున్నాడు.

దక్షిణాదికి చెందిన దేశభక్తులైన ఈ ఇద్ద రన్నదమ్ములు సిపాయిల తిరుగుబాటుగా ప్రసిద్ధి గాంచిన 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామా నికి స్ఫూర్తి ప్రదాతలుగా నిలిచారు!



# ఒప్పుకున్న తప్పు

యోగపురం రామాలయ పూజారి రామాంగుడు గొప్ప రామభక్తుడు. పురాతన ఆలయం పాడుపడి పోతూంటే గ్రామాధికారి దేవమ్మన్యుణ్ణి కలిసి మరమ్మతు చేయించమని కోరాడాయన. మితిమించిన కీర్తికండూతి గల దేవమ్మన్యుడు ఆలయంలోని రాముడి మాహిమ గురించి ప్రచారం చేయించాడు. ఫలితంగా ఆలయానికి పేరొచ్చి భక్తుల రద్దీ, ఆదాయం పెరిగాయి. గ్రామాధికారి వచ్చిన ఆదాయంలో కొంత గ్రామాభివృద్ధికని ఉంచుకుని మిగతా డబ్బుతో ఆలయానికి మరమ్మతు చేయించాడు.

ఇలా ఉండగా ఆలయ దర్శనానికి వచ్చిన రామానందుడనే యోగిపుంగవుడు పూజారి సపర్యలను, సద్బుద్ధిని మెచ్చి అతడితో, ''నాకు దేహత్యాగం చేయవలసిన సమయం ఆసన్నమయింది. నా వద్ద అద్భుతశక్తులుగల ఒక ఉంగరం ఉన్నది. దాన్ని నీకిస్తాను. దాన్ని ధరించి అద్భుతశక్తులతో నలుగురికీ మేలు చేసి మంచి పేరు తెచ్చుకో. నిన్నెవరైనా దూషిస్తే అది తప్పని ఒప్పుకుంటే క్షమించు. ఒప్పుకోని వారిని చిన్నశిక్షతో ఒక్కరోజు భయపెట్టు. నిన్ను దూషించడం తప్పని ఒప్పుకున్నవారిని శిక్షించనంతకాలం ఈ ఉంగరంలో మహిమ ఉంటుంది,'' అని చెప్పి ఒక ఉంగరాన్ని ఆయనకిచ్చాడు.

పూజారి వెంటనే, ''రాముణ్ణి నమ్ముకున్న నాకు ఎలాంటి శక్తులూ వద్దు. ప్రజాక్షేమాన్ని కోరి గ్రామాధికారి దేవమ్మన్యుడికి ఉంగరం ఇవ్వడం మేలు,'' అన్నాడు. రామానందుడు సరేనని, ''అర్హత లేకుండా అద్భుతశక్తులు లభిస్తే పతనమయ్యే ప్రమాదమున్నది. దేవమ్మన్యుడు పతనమైతే ఉంగరం మహిమ పోగొట్టే బాధ్యత నీది. ఆ తరవాత ఉంగరం మహిమ

'వసుంధర'



పోగొట్టిన వ్యక్తిని గ్రామాధికారి చేయాలి. లేకుంటే దేవమ్మన్యుడు దీర్ఘరోగంతో మంచం పడతాడు,'' అని హెచ్చరించి వెళ్ళాడు.

రామాంగుడు దేవమ్మన్యుణ్ణి కలిసి జరిగింది చెప్పాడు. మురిసిపోయిన దేవమ్మన్యుడు అన్నిటికీ సిద్ధపడి ఆ ఉంగరం తీసి ధరించాడు. అప్పటి నుంచి అతడు ఎందరికో జబ్బులు నయం చేశాడు. భవిష్యత్తు చెప్పి సమస్యలు పరిష్కరించాడు. అంతటితో ఊరుకోకుండా తాను దైవాంశ సంభూతుడినంటూ గ్రామస్థుల పూజలందుకోసాగాడు. కానుకల కోసం ప్రత్యేకంగా హుండీ ఏర్పాటుచేసి కావలసినంత దండుకోసాగాడు.

క్రమంగా రామాలయానికి వచ్చే భక్తుల సంఖ్య తగ్గిపోయింది. రామభక్తులు బాధ పడితే రామాంగుడు వారిని ఓదార్చడానికి అసలు విషయం చెప్పాడు. భగవత్కృపతో లభించిన అద్భుత శక్తులను సొంతానికి వాడుకోవడం మోసమని భావించిన ఆ భక్తులు అతడు మోసగాడని ప్రచారం మొదలు పెట్టారు. అది దేవమ్మన్యుడికి తెలిసి వాళ్ళను పిలిచి, "నేను దేవుణ్ణి దూషించలేదు. నావల్ల మీకు అపకారం జరగలేదు. మీరు నన్ను దూషించడం తప్పని ఒప్పుకుంటే క్షమిస్తాను. ఒప్పుకోకపోతే శిక్ష తప్పదు,'' అన్నాడు.

తప్పు అని ఒప్పుకోని మొదటివాడికి ఒళ్ళంతా ముళ్ళు గుచ్చుకున్నట్టు బాధ మొదలయ్యింది. రెండోవాడికి కంటిచూపు మందగించింది. మూడో వాడికి ముఖం వికృతమయింది. దాంతో నాలుగోవాడు హడలిపోయి తప్పొప్పుకుని క్షమాభిక్ష పొందాడు. దేవమ్మన్యుడు మిగతావారితో, "రేపటి దాకా శిక్ష అనుభవించి మామూలు మనుషులు కండి. ఇంకెప్పుడూ నన్ను దూషించకండి,'' అన్నాడు.

ఆ తరవాతి నుంచి ఊరందరికీ దేవమ్మన్యుడిపై భక్తితో పాటు భయం కూడా పుట్టింది. ఎదురన్నది లేని అతడిలో అహంపెరిగి విలాస జీవితానికి అలవాటు పడ్డాడు. దేవమ్మన్యుడి పతనం చూసి కలవరపడ్డ రామాంగుడు అతణ్ణి హెచ్చరించాడు. అయితే అతడు, "నావల్ల ప్రజలకు మేలు జరుగుతోంది. నేనెవరికీ అపకారం చేయడం లేదు. నా దారికి అడ్డు తగిలి నన్ను దూషిస్తే నీకైనా శిక్షతప్పదు,'' అన్నాడు పొగరుగా.

దేవమ్మన్యుడి పతనం ఆపాలంటే ఉంగరం మహిమ పోగొట్టాలి. ఉంగరం మహిమ

పోవాలంటే దేవమ్మన్యుడు తనను దూషించి తప్పు ఒప్పుకున్న వ్యక్తిని శిక్షించాలి. కాని, ఆయన ఆ విషయంలో చాలా జాగ్రత్తగా ఉన్నాడు. ఉపాయంగా కార్యం సాధించడం ఎలాగా అని ఆలోచిస్తూంటే రామాంగుడికి బృహదారణ్యంలో గురుకులం నడుపుతూన్న తన తమ్ముడు క్షమాంగుడు గుర్తుకు వచ్చాడు. వెంటనే బయలుదేరి వెళ్ళి క్షమాంగుణ్ణి కలుసుకున్నాడు.

అప్పుడు వికాసుడు, వినోదుడు, వివేకుడు అనే ముగ్గురు శిష్యులు నిజాయితీ విషయంలో ఏకాభిప్రాయం కుదరక గురువు దగ్గరికి వచ్చారు. నిజం చెప్పి మాట మీద నిలబడాలంటాడు వికాసుడు. నిజం చెప్పినా, అనువుగాని చోట మాట వెనక్కు తీసుకోవాలంటాడు వినోదుడు. ప్రమాదం నుంచి బయట పడడానికి అబద్ధమాడవచ్చంటాడు వివేకుడు. వాళ్ళలా చెబుతున్నప్పుడే రామాంగుడు వచ్చి తమ్ముడికి తనసమస్య వివరించాడు.

క్షమాంగుడు శిష్యుల వంక చూసి, "విన్నారుగా? ఇది మీ తెలివికీ, నా శిక్షణకూ పరీక్షా సమయం. నిజాయితీ గురించి శాస్త్రం ఒకలాగా, లౌక్యం మరొకలాగా చెబుతాయి. మీ సందేహాలకు సమాధానం దొరకాలంటే– మీరు మీ మీ పద్ధతుల్లో నిజాయితీగా ఉంటూ యోగపురంలో కార్యం సాధించాలి," అన్నాడు.

శిష్యులు ముగ్గురూ గురువు దీవెనలందుకుని యోగపురం బయలుదేరారు. అక్కడ దేవమ్మన్యుడి చర్యలను చూసి అతడు పెద్ద మోసగాడంటూ గ్రామస్థుల మధ్య కటువుగా



విమర్శించడం మొదలు పెట్టారు. అది తెలిసిన దేవమ్మన్యుడు వాళ్ళను పిలిపించి ఎప్పటిలాగే హెచ్చరించి తప్పు ఒప్పుకుంటే క్షమించి వదిలేస్తానన్నాడు.

వికాసుడు కోపంగా, "మోసగాణ్ణి మోసగాడనడం తప్పు కాదు," అన్నాడు. వెంటనే అతడి ముఖం వికృతమై కురూపిగా మారాడు.

అది చూస్తూనే వినోదుడు భయపడి తను చేసినది పొరబాటని ఒప్పుకున్నాడు.

వివేకుడు మాత్రం, "నేనేమీ అనలేదు. వాళ్ళిద్దరూ ఏదో అంటే, వాళ్ళతో కలిపి నన్నూ ఇక్కడికి తీసుకు వచ్చారు నీ వాళ్ళు. చేయని తప్పును నేనెందుకు ఒప్పుకోవాలి?" అని అబద్ధం చెప్పాడు.

అందుకు దేవమ్మన్యుడు కోపంగా, "నా భక్తులు అబద్ధమాడరు. నువ్వు నన్ను దూషిం

చడమే కాకుండా, అబద్ధం కూడా చెప్పావు. ఫలితంగా నీకు ఒక రోజంతా ఒళ్ళంతా మంటలు పుట్టి బాధిస్తాయి,'' అన్నాడు.

అయితే, వివేకుడి కేమీ కాలేదు. పైగా, వెంటనే వికాసుడి వికృత రూపం పోయి ఎప్పటి ముఖం వచ్చేసింది.

దేవమ్మన్యుడు నీరసపడి, ''నీ విషయంలో నా భక్తులు అబద్ధం చెప్పారు. అందుకే నా శక్తులు పోయాయి,'' అన్నాడు బాధతో.

అందుకు వివేకుడు నవ్వి, ''అన్న మాట అనలేదని అబద్ధ మాడితే అన్నది తప్పని ఒప్పుకున్నట్టేనని శాస్త్రం చెబుతుంది. ఆపైన తప్పు చేయలేదని కూడా అన్నాను. అంటే, నిన్ను దూషించడం తప్పని ఒప్పుకున్నట్టే కదా! ఒప్పుకోని వారినే తప్ప అబద్ధ మాడిన వారిని శిక్షించే అర్హత నీకు లేదు. అందుకే నీ ఉంగరం మహిమ కోల్పోయింది తప్ప, ఇందులో నీ భక్తుల పొరబాటేమీ లేదు,'' అన్నాడు.

దేవమ్మన్యుడు సిగ్గుతో తలదించుకుని, తన స్థానంలో వివేకుణ్ణి గ్రామాధికారిగా ఉండమని కోరాడు.

ఈలోగా రామాంగుడు, క్షమాంగుడు అక్కడికి వచ్చారు. క్షమాంగుడు తన శిష్యుల కేసి చూస్తూ, ''వివేకుడి తార్కిక బుద్ధి మెచ్చ తగినదేగాని, అబద్ధమొక్కటే కార్యసాధనకు సహకరిస్తుందని పొరబడకండి. ఏది ఏమైనా సత్యాన్ని వదల కూడదు. నిర్భయంగా నిజం చెప్పిన వికాసుడి కారణంగా గ్రామస్థుల్లో అనుమానం పుట్టింది. అంతలోనే నిజం కూడా బయటపడింది. మనం చెప్పే నిజం చెల్లుబాటు కానప్పుడు వెనకడుగు వేసి మనల్ని మనం కాపాడు కోవడం అవసరమని వినోదుడు నిరూపించాడు. నిజాయితీకి సంబంధించిన మీ సందేహాలు తీరడానికే ఎక్కడినుంచో వచ్చి రామానంద యోగి దివ్య శక్తులు గల ఉంగరాన్నిచ్చాడనుకుంటాను,'' అన్నాడు.

రామాంగుడు నవ్వి, ''అంతే కాదు. పతనాన్నికోరే మనిషే అద్భుతశక్తుల్ని కోరుకుంటాడు. యోగపురం రాముడు యోగిపుంగవుడి ద్వారా మనకు అందిస్తూన్న సందేశం ఇదే!'' అన్నాడు అక్కడున్న వారితో.



# యుక్సమ్ కథానాయకులు



ఆ టర్మ్‌కు బడి ఆఖరి రోజు. పదేళ్ళ నీరజ్ మనసులో సెలవుల్లో వెళ్ళనున్న తమ స్వస్థలం గురించీ, అక్కడి తాతాబామ్మల గురించీ ఉత్సాహకరమైన ఆలోచనలు రాసాగాయి. అంతలో ఉపాధ్యాయుడు 'హాలిడే హోమ్ వర్క్' గురించి ప్రస్తావించగానే, ''అరరే! ఇక నేను సెలవుల్లో తాతయ్య చెప్పే మౌంట్ ఖాంగ్‌చెంద్‌జంగా పరిసరాలలోని ట్రాగోపాన్స్, ఎర్రపాండాలు వంటి వింత పక్షుల, జంతువుల కథలు విన్నట్టే,'' అనుకున్నాడు.

అయితే, సెలవుల్లో రాసుకు రావలసిన వ్యాసం శీర్షిక 'మాతృభూమి కథానాయకులు' అని ఉపాధ్యాయుడు చెప్పడంతో మళ్ళీ నీరజ్‌లో ఉత్సాహం పుట్టుకువచ్చింది. అతడు చదివిన కథల పుస్తకాలు అతడి మనసులో కదలాడసాగాయి. దీనిని గురించి తరవాత చూద్దాం; ఇప్పుడు త్వరగా ఇల్లు చేరుకోవాలి. నాన్న యుక్సమ్‌లోని పాత ఇంటికి జీపులో తీసుకు వెళతానని చెప్పాడు కదా అనుకుంటూ నీరజ్ ఇంటికి బయలుదేరాడు.

సముద్ర మట్టానికి 5,800 అడుగుల ఎత్తులో ఉన్న యుక్సమ్, ఎత్తయిన పర్వతాల పాదతలంలో ఉన్నది. సిక్కిం బౌద్ధులు అతి పవిత్రంగా భావించే రాథోంగ్ నది అక్కడే ప్రవహిస్తున్నది. స్థానిక దేవతలకు నిలయమైన 109 తటాకాలు అందులో ఉన్నాయన్నది వారి విశ్వాసం. సిలిగురి నుంచి జీపులో యుక్సమ్ చేరుకోవడానికి ఐదు గంటలు పడుతుంది. నాన్న పక్కన కూర్చుని వెళుతూన్న నీరజ్, అతడి తల్లిలాగా నిద్రపోలేకపోయాడు. తండ్రి మలుపుల్లో చాలా ఒడుపుగా జీపును తిప్పడం ఎంతో ఆసక్తితో చూడసాగాడు. ఉన్నట్టుండి హోమ్‌వర్క్ గురించి జ్ఞాపకం రావడంతో తండ్రికేసి తిరిగి, ''మీకు నచ్చిన కథానాయకుడు ఎవరు నాన్నా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్న అతడి తండ్రి గ్యాల్ట్‌సెన్‌ను ఆలోచింప చేసింది. ఒక వినాశకర పథకం నుంచి యుక్సమ్‌ను కాపాడడానికి రాత్రింబవళ్ళు కృషి చేసిన సోనమ్, చుకీ, పీమా మొదలైన వారు ఆయన మనసులో మెదిలారు. వాళ్ళం

దరూ కథానాయకులే. ''మన రాథోంగ్ ఛూ పవిత్ర భూమిలో ప్రతి ఒక్కరూ కథానాయ కులే. ఖాంగ్‌చెంద్‌జంగా శిఖరం మీద కొలువున్న దేవత ఆశీస్సులు పొందినవారే,'' అని కొంతసేపు మౌనం వహించిన ఆయన, ''మన గ్రామంలో జరిగిన ఒక విషయం గురించి చెబుతాను. దాన్ని విన్నావంటే నా మాటల్లోని నిజం నువ్వే గ్రహించ గలవు,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

''1993 వేసవిలో ఒకనాడు మేము కొందరం గ్రామం పొలిమేరలో కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నాం. ఆ సమ యంలో సిమెంటు బస్తాలతో, తవ్వడానికి పనికి వచ్చే కొరముట్లతో ఒక ట్రక్కు మన గ్రామం కేసి రావడం కనిపించింది. ట్రక్కు డ్రైవర్ ఎవరోనదికి అడ్డంగా పెద్ద గోడ నిర్మించ బోతున్నారని చెప్పాడు. నదీ ప్రవాహానికి ఆనకట్ట కట్టి, జల విద్యుత్తును తయారు చేయడం వాళ్ళ ఉద్దేశం. ఆ తరవాత నేనూ, నా మిత్రులూ ఈ విషయం గురించే మాట్లా డుకోసాగాం. గ్రామంలోని ఇంటింటికీ విద్యు ద్దీపాలు రావడం మంచిదే. అయినా ఈ ఆన కట్ట నిర్మించడం వల్ల ఈ ప్రాంతంలో ఏర్పడ నున్న పర్యవసానాలు ఎలాంటివి?



ఆ తరవాత మరికొన్ని రోజులు యుక్స మ్‌లో ప్రతిచోటా దీన్ని గురించే మాట్లాడుకో సాగారు. దీన్ని గురించి ఒక నిర్ణయానికి రావడం ముఖ్యమని పెద్దలు భావించడంతో ఒక సమావేశం ఏర్పాటు చేశారు. గ్రామం మధ్య విల్లోచెట్టు కింద కూర్చున్నారు. పరిసర ప్రాంతాల 'గొంపాస్' నుంచి లామాలు కూడా సమావేశానికి హాజరయ్యారు. గ్రామ పెద్దలు, లామాలు కలిసి సుదీర్ఘ చర్చలు జరిపారు. యుక్సమ్ చాలా పవిత్రమైనదనీ, ప్రత్యేకమైన దనీ మాకు తెలియజేశారు.

''మనం నివసించే భూమిని గురు రిన్పోచ్ ఆశీర్వదించాడని మన పవిత్రగ్రంథం నేశోల్ పేర్కొంటున్నది. ఈ బండలలో, కొండలలో, చెట్లలో, కొలనుల్లో దేవతలు కొలువున్నారు. మనం ఇప్పుడా ఆనకట్ట నిర్మాణాన్ని అనుమ తించామంటే ఇక్కడి చెట్లు నరకబడతాయి. బండలు పగలగొట్ట బడతాయి. మనతో ఇన్నాళ్ళు సహజీవనం సాగించిన పక్షులు, సీతాకోక చిలుకలు దూర ప్రాంతాలకు వెళ్ళి

పోతాయి. దేవతలు వెళ్ళి పోతారు. ఆపైన మనం సంతోషంగా ఉండలేము,'' అని సన్నటి కంఠస్వరంతో వివరించాడు ఒకపండు ముదుసలి అయిన లామా.

కథను జాగ్రత్తగా వింటున్న నీరజ్ అడ్డుపడి, ''కాథోక్ తటాకంలోకి మన్ను తెచ్చి పోశారని గత సంవత్సరం తాతయ్య చెప్పారు. అక్కడ తాతయ్యతో కలిసి చాలా మంది ప్రార్థనలు జరుపుతారని వారికి ఎవరూ చెప్పలేదా ఏంటి?'' అని అడిగాడు.

''అవును. అవన్నీ కూడా ఆ నిర్మాణం కోసం చేపట్టిన పనులే. అలా చేయడానికి ముందు మాట మాత్రమయినా చెప్పడానికి ఎవరూ పట్టించుకోలేదు. నిన్ను తాతయ్య బమ్‌చూ ఉత్సవానికి తీసుకువెళ్ళేవాడే జ్ఞాపకం ఉందా?'' అని అడిగాడు గ్యాల్ట్‌సెన్.

''ఉంది. అక్కడ గుమి కూడిన జనాన్ని చూడడానికి వీలుగా నన్ను భుజాల మీదికి ఎత్తుకుని వెళ్ళేవారు. మన మఠంలో ప్రత్యేక పాత్రలోని జలాన్ని సేవించడానికి ప్రతి ఒక్కరూ ఎగబడేవారు. ఆ నీటిలో ఒక చుక్క పుచ్చుకుంటే చాలు; జీవితాంతం ఎలాంటి జబ్బూ రాదనీ, గురుపద్మసంభవుడి చల్లని ఆశీస్సులు ఎల్లప్పుడూ లభిస్తాయనీ చెప్పారు,'' అన్నాడు నీరజ్.

తమ సంప్రదాయం గురించీ, నమ్మకం గురించీ మనవడికి తెలియజేసిన తన తండ్రికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్న గ్యాల్ట్‌సెన్, మళ్ళీ కథను కొనసాగించాడు: ''సమావేశంలో లామా చెప్పిన మాటలు విన్న పెద్దలు ఆ నిర్మాణాన్ని అనుమతించ కూడదని నిర్ణయించారు. ఆ తరవాత తమ నిర్ణయాన్ని సంబంధిత అధికారులకు తెలియజేశారు. సిక్కిం మొత్తంమీది లామాల నాయకత్వంలో మన గ్రామప్రజలందరం గ్యాంగ్‌టాక్ చేరుకున్నాం. మేళాలు వాయిస్తూ వీధుల గుండా ఊరేగింపుగా వెళ్ళాం. లామాలు తాళాలు వాయిస్తూ వచ్చారు. మేము పట్టుకెళ్ళిన బోర్డులు, చేసిన నినాదాలు మా ఆశయాన్ని స్పష్టంగా చాటాయి. మనకూ మన భూమికీ కావలసినవి ఏమిటన్నది తేటతెల్లం చేశాం.

ఆ తరవాత అంకుల్ పీమా, అంకుల్ సోనమ్, ఆంటీ చుకీ ఆ నిర్మాణం జరిగితే వాటిల్లే నష్టాలను వివరిస్తూ ప్రజలకు అనేక ఉత్తరాలు రాశారు. వాళ్ళు అలా చేయకుండా ఉంటే ఆ పథకం గురించి బయటి వారికి సరైన సమయంలో తెలిసి ఉండేది కాదు. అడ్డుకోలేకపోయి ఉండే వాళ్ళం.

1997లో అంకుల్ పీమా యుక్సమ్‌లో ఆ పథక నిర్మాణం జరగదని తెలియజేసే ఉత్తరాన్ని మావద్దకు తీసుకు వచ్చాడు.'' అని చెప్పడం ముగించిన గ్యాల్ట్‌సెన్, ''ఇప్పుడు చెప్పు. మేమందరం హీరోలమే కదా?'' అని అడిగాడు.

''అవును. హీరోలే!'' అంటూ నవ్విన నీరజ్ తన హాలిడే ప్రాజెక్టుకు ఒక యథార్థ గాథ లభించినందుకు చాలా సంతోషించాడు. యుక్సమ్ ప్రకృతి సంపదలను కాపాడుకోవడానికి తమ పెద్దలు చేసిన కృషిని మనసులోనే మెచ్చుకున్నాడు.

– మంజు మేనన్

# భారత దేశ నూతన ప్రపంచ ఛాంపియన్లు



పంకజ్ అద్వానీ

## బిల్లియర్డ్స్

బెంగళూరుకు చెందిన పంకజ్ అద్వానీ బెంగళూరులో జరిగిన ఐబిఎస్ఎఫ్ వరల్డ్ బిల్లియర్డ్స్ ఛాంపియన్‌షిప్‌లో పాయింట్స్, టైమ్ ఫార్మట్ రెండింటిలోనూ వరల్డ్ ఛాంపియన్‌గా వచ్చాడు. పాయింట్స్ ఫార్మట్‌లో సెప్టెంబర్ 10వ తేదీ గీత్ సేథీని ఓడించాడు. నాలుగు రోజుల తరవాత దేవేంద్ర జోషిని 2370-2020 లెక్కన ఓడించాడు. 2005లో మాల్టాలో జరిగిన వరల్డ్ ఛాంపియన్‌షిప్‌లో పంకజ్ ఇలాంటి జంట విజయాలనే సాధించాడు. నిజానికి స్నూకర్ మరియు బిల్లియర్డ్స్ రెండింటిలోనూ వరల్డ్ టైటిల్స్ సాధించిన ఇద్దరిలో ఒకడు పంకజ్ అద్వానీ. రెండవ వ్యక్తి మాల్టాకు చెందిన పాల్ మిఫ్‌సూద్. యువ తరంగంగా అభివర్ణించబడే పంకజ్ వయసు ఇరవైమూడేళ్ళు.

## ధోనీకి ఐసిసి అవార్డు



మహేంద్రసింగ్ ధోనీ

భారతదేశ ఒన్ డే ఇంటర్నేషనల్ (ఒ డి ఐ) కెప్టెన్ మహేంద్రసింగ్ ధోనీ 2008 ఇంటర్నేషనల్ క్రికెట్ కౌన్సిల్ ఒ డి ఐ ప్లేయర్ అవార్డు గెలుచుకున్నాడు. ఓటింగ్ కాలంలో అతడు 39 ఒ డి ఐ లలో ఆడి 1,298 పరుగులు అంటే అతడు ఫేస్ చేసిన 100 బాల్స్‌కు 82.42 రన్స్ ప్రకారం సగటున 49.92 పరుగులు చేశాడు.

ఒక సెంచురీ, తొమ్మిది 50లు కొట్టాడు. వికెట్ కీపర్‌గా 46 కేచస్, 46 స్టంపింగ్స్ చేశాడు. ఒ డి ఐ బ్యాట్స్‌మన్ ఐ సి సి ప్లేయర్ ర్యాంకింగ్స్‌లో అతడు ప్రస్తుతం 1వ స్థానంలో ఉన్నాడు. భారత దేశానికి చెందిన యువరాజ్ సింగ్ మొదటి ట్వెంటీ 20 ఇంటర్నేషనల్ ఫెర్‌ఫార్మెన్స్ ఆఫ్ ది ఇయర్ అవార్డు గెలుపొందాడు. అవార్డు కొత్తగా ప్రవేశ పెట్టబడింది. సెప్టెంబర్ 11వ తేదీ దుబాయ్‌లో అవార్డు ప్రదానోత్సవం జరిగింది.

## బ్యాడ్మింటన్

హైదరాబాదుకు చెందిన పద్దెనిమిదేళ్ళ సాయినా నేహ్వాల్ తాయ్‌వాన్‌లో సెప్టెంబర్ 14వ తేదీ ఈ యేటి యోనెక్స్ చైనీస్ తాయ్‌పీ గ్రౌండ్ ప్రి గోల్డ్‌బ్యాడ్మింటన్‌ఛాంపియన్‌షిప్‌ను సాధించింది. ఆమె మలేసియాకు చెందిన లియా లైడియాను 21-8, 21-19 చొప్పున ఓడించింది. సాయినా 2006 ఫిలిప్పైన్స్ ఓపెన్‌లో మలేసియాకు చెందిన జూలియా జియాన్ పీయ్ వాంగ్ మీద 21-15; 22-20 లెక్కన ఆధిక్యత సాధించింది. ఆమె తాయ్‌వాన్‌కు వెళ్ళినప్పుడు ఇంటర్నేషనల్ బ్యాడ్మింటన్ ఫెడరేషన్ ర్యాంకింగ్‌లో ప్రపంచంలో 14వ స్థానంలో ఉండేది. ఇటీవలి విజయంతో 11వ స్థానానికి దూసుకు వెళ్ళింది. ఆగస్టులో జరిగిన బీజింగ్ ఒలింపిక్స్‌లో ఆమె క్వార్టర్-ఫైనల్స్‌కు చేరుకున్న విషయం గుర్తుంచుకోతగ్గ విశేషం.



సౌరవ్ గోశాల్
సాయినా నేహ్వాల్

## స్క్వాష్

సౌరవ్ గోశాల్‌ను జయంట్-కిల్లర్ అంటారు. ఫ్రాన్స్ బోర్డియాక్స్‌లో సెప్టెంబర్ 13వ తేదీ జరిగిన ఆర్నావో ఇంటర్నేషనల్ ఓపెన్ ప్రారంభంలో ఆయన థర్డ్ సీడ్ డేవిడ్ బియాన్ చెటీని పిఎస్ఎ టూర్ స్క్వాష్‌లో దిగ్భ్రాంతి పరచాడు. ఆయన 11-6, 11-6, 9-11, 11-9 లెక్కన జయించాడు. ఇది అతనికి నాలగవ వరల్డ్ టైటిల్. అంతకుముందు, అతడు టాప్ సీడ్ ఫ్రాన్సుకు చెందిన రెనాన్ లావిగ్నేను క్వార్టర్ - ఫైనల్స్‌లోనూ, ఫిఫ్త్ సీడ్ ఈజిప్టుకు చెందిన అమ్ర్ స్వెతామ్‌ను ఫైనల్స్‌లోనూ గెలుపొందాడు. పిఎస్ఎ ఫైనల్‌లో పాల్గొనడం అది ఆరవ సారి; బియాన్ చెటీ 18 ఫైనల్స్ ఆడాడు. తన విజయం, తనకు గత మూడేళ్ళుగా శిక్షణ ఇస్తూన్న బ్రిటిష్ కోచ్ మాల్కమ్ విల్‌స్ట్రాప్‌కే చెందుతుందని గోశాల్ అన్నాడు.



# మద్యపాన ఫలితం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్వుడు పండితవంశంగా ప్రసిద్ధిగాంచిన ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. ఆయన తనకు ఇరవైఏళ్ళ వయసు వచ్చేవరకూ సర్వశాస్త్రాలూ చదివి, మహాపండితుడన్న ఖ్యాతి గాంచాడు.

ఆయనకు తల్లిదండ్రులు వివాహం చేయ చూశారు. కాని, బోధిసత్వుడు అందుకు అంగీకరించకసన్యసించి హిమాలయ పర్వతాలకు పోయి, ఒకసుందర ప్రదేశంలో ఆశ్రమం నిర్మించుకుని ఉండసాగాడు.

ఒకసారి బోధిసత్వుడు వానాకాలం నాలుగు నెలలూ శ్రావస్తిలో గడిపి, శిష్యులతో భద్రవతి అనే గ్రామం చేరాడు. అక్కడికి కోసుదూరంలో ఒక నదీ, అంబ తీర్థ మనే ప్రసిద్ధ స్థలమూ వున్నవి. ఆయన ఆ తీర్థం కేసి శిష్యులతో బయలుదేరాడు. ఆ తీర్థం ఒడ్డున ఒక ముని ఆశ్రమమూ, ఆ ఆశ్రమంలో అంబకతీర్థిక అనే మహా విషసర్పమూ వున్నవి. ఇది తెలిసిన గ్రామవాసులు బోధిసత్వుడికి అక్కడికి వెళ్ళ వద్దని సలహా ఇచ్చారు. ఆయన అది వినీ విననట్టు ఊరుకున్నాడు.

ఆయన శిష్యుల్లో సాగతస్థవిరుడనే వాడొక డున్నాడు. అతడు మంత్రశాస్త్రంలో ఆరితేరిన వాడే గాక, అసామాన్య ధైర్యశాలి. అతడు తతిమ్మావాళ్ళ నుంచి వేరుపడి ముని ఆశ్రమానికి వెళ్ళాడు.

ఆ సమయంలో ముని లేడు. సాగతస్థవిరుడు ఆశ్రమంలో ప్రవేశించి, ఒకచోట తుంగచాప పరుచుకుని కూర్చున్నాడు. ఆ వెంటనే మహా భయంకరాకారంలో వున్న విషసర్పం అతడి ముందుకు వచ్చి బుస్సు మంటూ పడగవిప్పింది.

సాగతస్థవిరుడు ఏమాత్రం జంకక, ''నువ్వేనా, అంబకతీర్థిక అనే నీటి పామువి?'' అన్నాడు.

జాతక కథ

ఆ ప్రశ్న వింటూనే సర్పం పెద్దగా బుసలు కొట్టడం ప్రారంభించింది. దాని నోట్లో నుంచి నల్లనిపొగలు లేచినై. స్థవిరుడు కూడా మంత్ర శక్తితో తన నోట్లో నుంచి పొగలు వెలువరించాడు. ఆ వెంటనే సర్పం నోటినుంచి అగ్ని జ్వాల లేచింది. స్థవిరుడు తన నోటినుంచి అగ్నిజ్వాల లేపాడు.

ఈ విధంగా నాలుగైదు నిమిషాల కాలం స్థవిరుడూ, విషసర్పం తమ శక్తిసామర్థ్యాలు ప్రదర్శించుకున్నారు. స్థవిరుడి నిర్భయత్వం గమనించిన సర్పం, ఇక చేసేదిలేక తల వాల్చి వెనక్కు తిరిగింది. స్థవిరుడు దాని తోక పట్టుకుని వెనక్కు లాగాడు.

''అంబకతీర్థికా, ఇక్కడ తీర్థమాడవచ్చిన యాత్రికులు చాలామంది, నీ కాటుకు మరణించారని, నాకు తెలుసు!'' అంటూ స్థవిరుడు విషసర్పం కోరలు పీకి, దాన్ని ప్రాణాలతో వదిలాడు.

ఇది జరిగిన పక్షం రోజుల తర్వాత బోధిసత్వుడు భద్రవతి నుంచి కోశాంబీ నగరానికి వెళ్ళాడు. స్థవిరుడు మహా సర్పాన్ని కోరలు పీకి వదిలిన సంగతి గ్రామాల్లోనూ, పట్టణాల్లోనూ మారు మోగి పోయింది. కోశాంబీ వాసులు బోధిసత్వుడికి ఘనంగా స్వాగతం ఇచ్చి, ఒక పెద్ద ఉద్యానంలో నివాసం ఏర్పాటు చేశారు.

ఆ మర్నాటి ఉదయం కొందరు నగర వాసులు బోధిసత్వుడి దర్శనం చేసుకుని. కొందరు సహాధ్యాయులతో ఒక పెద్ద చెట్టు నీడలో కూర్చుని వున్న స్థవిరుడి వద్దకు పోయి, నమస్కరించి, ''మీరు ఎక్కడో దూరాన హిమాలయాల్లో నివసించేవారు. అక్కడ



మీరు కోరిన వస్తువులు దొరకడం దుర్లభం. అలాంటి వేమైనా వుంటే మాకు చెప్పండి. తక్షణం తెచ్చి ఇవ్వగలం,'' అన్నారు.

స్థవిరుడు జవాబు చెప్పకుండా ఊరు కున్నాడు. అప్పుడు శిష్యుల్లో ఇద్దరు, ''అయ్యలారా, మాకు పారావతమద్యం తాగాలని వున్నది. అది ఇంతవరకూ మాకు ఎక్కడా లభించలేదు. ఆ మద్యం తయారు చేసి పంపండి,'' అన్నారు.

నగరవాసులు అందుకు ఒప్పుకుని, మధ్యాహ్నం లోపల పారావతమద్యం తయారు చేసి, ఒక గృహస్థు ఇంట్లో దాచి, స్థవిరుణ్ణి వెంటబెట్టుకు పోయారు.

స్థవిరుడు పారావతమద్యం తాగడం ప్రారంభించి క్రమంగా కైపు తలకెక్కడంతో లేచి, పిచ్చివాడిలా మాట్లాడుతూ గంతు లేస్తూ నగరద్వారం కేసి పరిగెత్తి, అక్కడ పడి పోయాడు. వెంట వున్న సహాధ్యాయులు అతణ్ణి భుజాల మీద వేసుకుని బోధిసత్త్వుడి దగ్గిరకు తెచ్చి, ఆయన పాదాలముందు తల వుండేలా పడుకోబెట్టారు.

అయితే, స్థవిరుడు తూలుతూ కోపంగా లేచి, బోధిసత్త్వుడి వైపుకు పాదాలుచాచి పడుకున్నాడు.

బోధిసత్త్వుడు చిరునవ్వు నవ్వి, శిష్యులతో, ''అంబతీర్థంలో మహా విషసర్పాన్ని లొంగ దీసినదెవరు?'' అన్నాడు.

''స్థవిరుడు!'' అన్నారు వాళ్ళు.

''ఇప్పుడా స్థవిరుడు బురదపామునైనా లొంగతీయగలడా?'' అని బోధిసత్త్వుడు అడిగాడు.

''లొంగతీయలేడు,'' అన్నారు శిష్యులు.

అప్పుడు బోధిసత్త్వుడు, ''ఈ అనుభవాన్ని మరిచిపోకండి! మద్యపానం దేహానికి మైకమే కాదు, బుద్ధిభ్రమ కూడా కలిగిస్తుంది. ఈ నాటి నుంచి ఎవరూ మద్యపానం చేయరాదని నియమం పెడుతున్నాను,'' అన్నాడు.

మద్యపాన మైకం నుంచి తేరుకున్నాక స్థవిరుడు బోధిసత్త్వుడి కాళ్ళ మీద పడి దుఃఖించసాగాడు. ఆయన వాణ్ణి లేవనెత్తి, మద్యపానం వల్ల కలిగే దుష్ఫలితాలు వివరించి చెప్పాడు.





# రామాయణం

అక్షకుమారుణ్ణి హనుమంతుడు చంపాడని వినగానే రావణుడికి ఎంతో దుఃఖం కలిగింది. అతను దాన్ని అణచుకుని క్రోధావేశంతో ఇంద్రజిత్తును చూసి, "నాయనా, ఇంద్రుణ్ణి జయించిన వీరాగ్రేసరుడివి, బ్రహ్మ నుంచి దివ్యాస్త్రాలు పొందినవాడివి. ఈ కోతి కింకరుల నందరినీ చంపాడు. జంబుమాలినీ, మంత్రి కొడుకులనూ, అయిదుగురు సేనాపతులనూ, నీ తమ్ముడైన అక్షకుమారుణ్ణీ చంపాడు. వాడి బలం ఎలాటిదో సరిగా గ్రహించి వాడితో యుద్ధం చెయ్యి. వెళ్ళి శత్రువును జయించి తిరిగి రా!" అన్నాడు.

ఇంద్రజిత్తు తండ్రికి ప్రదక్షిణం చేసి, ధనుర్బాణాలు తీసుకుని, రథమెక్కి, యుద్ధోత్సాహంతో హనుమంతుడి కేసి వెళ్ళాడు. హనుమంతు డతణ్ణి దూరాన చూస్తూనే గట్టిగా సింహనాదం చేసి, తన శరీరాన్ని పెంచాడు. తరవాత ఇద్దరూ యుద్ధానికి తలపడ్డారు. ఇంద్రజిత్తు పదకొండువేల మంది ధనుర్ధారులతో ఒక్కసారిగా యుద్ధం చేయగలవాడు. కాని అతను తనపై వేసే బాణాలు తనకు తగలకుండా తప్పించుకుంటూ హనుమంతుడాకాశాన విహరించసాగాడు.

ఎంతసేపు యుద్ధం చేసినా హనుమంతుడు ఇంద్రజిత్తుకు గాని, ఇంద్రజిత్తు హనుమంతుడికి గాని అంతు చిక్కలేదు. తన బాణాలన్నీ వృథా అయిపోవటం చూసి ఇంద్రజిత్తు, "వీణ్ణి చంపటం అసాధ్యం. ఏదోవిధంగా పట్టుకోవటం మంచిది," అనుకుని అందుకై బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. దానితో హను

సుందరకాండ – 6



మంతుడు కట్టుపడి, చెయ్యీ కాలూ కదిలించలేని స్థితిలో ఉండి పోయాడు. అప్పుడతనికి, పూర్వం బ్రహ్మ తనకిచ్చిన వరం జ్ఞాపకం వచ్చింది. అతనికి ఏ అస్త్రం వల్లా ప్రమాదం లేకుండా బ్రహ్మ వరమిచ్చాడు. బ్రహ్మాస్త్రం చేత కట్టుపడినప్పటికీ, తనను బ్రహ్మ, దేవేంద్రుడూ, వాయుదేవుడూ కాపాడుతూనే ఉంటారని హనుమంతుడనుకున్నాడు. అతనికి రావణుడితో సంభాషించాలని కూడా కోరిక కలిగింది.

కదలకుండా పడి ఉన్న హనుమంతుణ్ణి రాక్షసులు సమీపించి, తాళ్ళతో అతణ్ణి బంధించారు. వారు హనుమంతుణ్ణి తాళ్ళతో కట్టగానే బ్రహ్మాస్త్రబంధం దానంతట అదే విడిపోయింది. ఈ సంగతి తెలిసిన ఇంద్రజిత్తు చాలా భయపడ్డాడు. ఎందుకంటే హనుమంతుడీ తాళ్ళను సులువుగా తెంచగలడు, బ్రహ్మాస్త్రం ప్రయోగించిన వాడి పైన మరే అస్త్రమూ పారదు. కనుక, హనుమంతుడిప్పుడు తలుచుకుంటే లంకకు ఎంతటి హానినైనా చేయగలడు.

అయితే, ఈ సంగతి హనుమంతుడికి తెలియలేదు. తాను తాళ్ళతో కట్టుపడగానే బ్రహ్మాస్త్రబంధం తొలగిందని కూడా అతనికి తెలియదు. రాక్షసులు హనుమంతుణ్ణి కర్రలతోనూ పిడికిళ్ళతోనూ కొట్టుతూ, రావణుడుండే చోటికి లాక్కుపోయారు. ఇంద్రజిత్తు రావణుడికి హనుమంతుణ్ణి చూపి, ''వీడే ఆ వానరుడు,'' అన్నాడు.

సభలోని రాక్షసప్రముఖులు తమలో తాము, ''ఎవడీ వానరుడు? ఇక్కడికెందుకు వచ్చాడు? ఎవరు పంపగా వచ్చాడు? ఎవరిని చూడ వచ్చాడు?'' అని ప్రశ్నించుకున్నారు. మరికొందరు రాక్షసులు, ''ఈ వానరుణ్ణి చంపి కాల్చండి, తినేద్దాం!'' అన్నారు.

హనుమంతుడు ముందుకు వచ్చి, రావణుడి సింహాసనం దిగువన కూర్చుని ఉన్న వృద్ధమంత్రులనూ, మణులతో అలంకరించిన సభాభవనాన్నీ కలయజూశాడు. రాక్షసులు తాళ్ళు పట్టుకుని అటూ, ఇటూ గుంజుతున్న హనుమంతుణ్ణి రావణుడు చూశాడు. అతని కళ్ళు ఆగ్రహంతో చింత నిప్పుల్లాగా అయిపోయాయి. అతను తన మంత్రులను ఆజ్ఞాపిస్తూ, హనుమంతుణ్ణి చూపి, ''వీడి విషయమేమిటో అడిగి కనుక్కోండి!'' అన్నాడు.

హనుమంతుడు రావణుణ్ణి, అతడి మంత్రులైన దుర్ధరుణ్ణి, ప్రహస్తుణ్ణి, మహాపార్శ్వుణ్ణి, నికుంభుణ్ణి, రావణుడి అత్యంత వైభవాన్నీ, తేజస్సునూ చూసి ఆశ్చర్యం పొందాడు. ఈ రావణుణ్ణి చూసి మూడు లోకాలూ గజగజ లాడటంలో వింత ఏమీ లేదని అతనికి అనిపించింది.

ఇంతలో రావణుడి ప్రేరణతో ప్రహస్తుడు హనుమంతుడితో ఇలా అన్నాడు:

''వానరుడా, భయపడకు. నిన్నెవరు పంపారు? దిక్పాలకులా? విష్ణువా? ఎవరు పంపినప్పటికీ నిన్నేమీ చెయ్యము. నిజం చెప్పు, నిన్ను విడిచిపెడతాము. నువ్వు చూడటానికి కోతిలాగా ఉన్నావేగాని, నీ ప్రభావం చాలా హెచ్చుగా కనబడుతున్నది. అబద్ధం చెప్పావో, నీ ప్రాణాలు దక్కవు. ఒకవేళ నీ అంతట నువ్వు వచ్చి ఉంటే, ఎందుకు వచ్చావో చెప్పు.''

ప్రహస్తుడీ మాటలనగానే హనుమంతుడు రావణుడి కేసి తిరిగి, ''నన్ను పంపినది ఇంద్రుడూ, కుబేరుడూ, వరుణుడూ, యముడూ కాదు. విష్ణువు కూడా కాదు. నేను పుట్టుకతోనే వానరుణ్ణి; నాది తెచ్చి పెట్టుకున్న వానర రూపం కాదు. నిన్ను చూడటం సులభం కాదు గనక, అందుకై అశోకవనాన్ని నాశనం చేశాను. అప్పుడు బలవంతులైన రాక్షసులు నా పైకి వచ్చారు. ఆత్మరక్షణ కోసం వారిని చంపాను. బ్రహ్మవరం వల్ల నన్ను ఏ అస్త్రమూ ఏమీ చెయ్యలేదు. కాని నిన్ను చూడాలనే కోరికతో బ్రహ్మాస్త్రానికి కట్టుపడ్డాను. నీతో ఒక




రాచకార్యం ఉండి వచ్చాను. నేను రాముడి దూతను. నీకు శుభకరమైన మాటలనే చెబుతాను, విను. ఈ మాటలను సుగ్రీవుడు నీతో చెప్పమన్నాడు. దశరథుడి కొడుకైన రాముడు, తన భార్య అయిన సీతతోనూ, తమ్ముడైన లక్ష్మణుడితోనూ తండ్రి ఆజ్ఞ పాలించి దండకారణ్యానికి వచ్చాడు. అక్కడ రాముడి భార్య అయిన సీత కనపడకుండా పోయింది. రాముడు సీతను వెతుకుతూ ఋశ్యమూకానికి వచ్చి సుగ్రీవుణ్ణి చేరుకున్నాడు. తరువాత ఆయన వాలిని చంపి, సుగ్రీవుణ్ణి వానర భల్లూకాలకు రాజునుగా చేశాడు. అందుకు ప్రత్యుపకారంగా సుగ్రీవుడు సీతను వెతికిస్తానని మాట ఇచ్చాడు. ఆ మాట ప్రకారం ఆయన అన్ని దిక్కులకూ వానరులను పంపాడు. వారిలో ఒకడనైన నేను

వాయుపుత్రుణ్ణి, హనుమంతుడనే వాణ్ణి. నేను నూరు యోజనాల సముద్రం దాటి సీతను చూడటానికి వచ్చాను. నీ అధీనంలో ఉన్న సీతను చూశాను. ఎంతో తపస్సు చేసి, ధర్మం తెలిసిన నీ వంటివాడు పరస్త్రీని చెర పట్టటం కూడని పని. రాముడికి అపచారం చేసి ఫలమనుభవించక పోవటం ఎవరికీ సాధ్యం కాదు. ఇక ముందు రాముడేం చేస్తాడో నాకు తెలియదు. సీతను రాముడి కిచ్చి వేయటం నీకు శ్రేయస్కరం. అనేక జాతుల వల్ల నీకు మరణం రాకుండా వరం పొంది ఉన్నావు నిజమే, కాని సుగ్రీవుడు ఆ జాతులలో దేనికీ చెందని వానరుడు. నరుడైన రాముడి చేతిలోనో, వానరుడైన సుగ్రీవుడి చేతిలోనో నీకు చావు తప్పదు. రాముడు ఒప్పడు గాని, నే నొక్కణ్ణే నీ లంకను నిర్మూలించ గలను. అసలు సీతను అపహరించి తెచ్చినప్పుడే మృత్యుదేవతను మెడకు చుట్టు కున్నావు. నేను రాయబారిని: అటు మాన వుణ్ణి కాను, ఇటు రాక్షసుణ్ణి కాను. రాముడితో వైరం పెట్టుకుని నువ్వు జీవించలేవు,'' అన్నాడు.

ఈ మాటలు విని రావణుడు కోపోద్రేకంతో హనుమంతుణ్ణి చంపవలసిందిగా ఆజ్ఞ ఇచ్చాడు. అప్పుడు విభీషణుడు తన అన్నకు అడ్డు తగిలి ఇలా అన్నాడు: ''ఈ దూతను చంపటం రాజధర్మం కాదు. ఆగ్రహావేశంలో ధర్మహాని చెయ్యటం తగదు. ఇతను కేవలమూ దూత మాత్రమే కాదు, అక్షుడు మొదలైన వారిని చంపాడు కనుక శత్రువే. అయినను దూతగా వచ్చిన వాడికి విధించే శిక్షలున్నాయి. ఇతనికి అంగవైకల్యం కలిగించవచ్చు,





కొరడాతో కొట్టవచ్చు, శిరస్సు ముండనం చేయవచ్చు, కాల్చి ముద్ర వేయవచ్చు - కాని చంపరాదు. శాస్త్రం మాట అటుంచి, ఇతణ్ణి చంపటం చేత మనకేమీ లాభం లేదు. ఇతణ్ణి ఎవరు పంపారో వారిని చంపు.''

ఈ మాట రావణుడికి నచ్చింది. ''నిజమే, దూత అయిన వీణ్ణి చంపవద్దు, మరేదైనా శిక్ష విధింతాము. కోతులకు ఇష్టమైనది తోక. ఇతడి తోకను కాల్చి పంపెయ్యండి. తోక అంటించి వీణ్ణి నగర వీధులన్నీ తిప్పండి,'' అన్నాడు.

రాక్షసులు హనుమంతుడి తోకకు గుడ్డ పీలికలు చుట్టి, చమురుపోసి అంటించి, నాలుగు వీధులూ తిప్పుతూ, 'వేగులవాణ్ణి చూడండి,'' అని కేకలు పెట్టారు. హనుమంతుడిది లక్ష్యపెట్టక, పట్టపగలు నగర రక్షణ సాధనలు ఎట్లా ఉన్నదీ చూడవచ్చునని ఆశపడ్డాడు. అతణ్ణి చూడటానికి రాక్షస స్త్రీలూ, పిల్లలూ ఎగబడ్డారు. కొందరు రాక్షస స్త్రీలు సీత వద్దకు వెళ్ళి, ''నీతో మాట్లాడి వెళ్ళాడే, ఆ వానరుడి తోకకు నిప్పు అంటించి, నగరమంతా తిప్పుతున్నారు,'' అని చెప్పారు.

సీత ఆ మాటలు విని చాలా బాధపడి, నేనే పతివ్రతనైతే హనుమంతుడికి చల్లగా ఉండు, అని అగ్నిహోత్రుణ్ణి ప్రార్థించింది.

సీత ఈ మాట అనగానే హనుమంతుడి తోకలోని జ్వాలలు మరింత పెద్దవయ్యాయి. కాని హనుమంతుడికి మంట తోచలేదు. అది చూసి హనుమంతుడికి ఆశ్చర్యమయింది. అతను చేయవలసిన దాన్ని గురించి ఆలోచించాడు. మొట్టమొదటగా మిక్కిలి చిన్నవాడై కట్ల నుంచి విడిపించుకున్నాడు. మరుక్షణమే తన దేహాన్ని పెంచి, నగరద్వారం వద్ద ఉన్న పరిఘను తీసుకుని, తనవెంట ఉన్న రాక్షసుల సందరినీ చావమోదాడు. అతను లంకానగరం కేసి చూస్తూ, ''ఇప్పుడేం చేస్తే బాగుంటుంది?'' అనుకున్నాడు. అప్పటికే రాక్షసులకు చేయవలసిన నష్టం చాలా చేశాడు. లంకా దుర్గాన్ని నాశనం చెయ్యటమే మిగిలి ఉన్నది. లంకలోని మహాభవనాలను అగ్ని హోత్రుడికి ఆహుతి ఇవ్వటమే కర్తవ్యం.

ఈ మాట అనుకుని హనుమంతుడు మండుతున్న తోకతో లంకలోని భవనాల మీదుగా సంచరించ నారంభించాడు. నిర్భయంగా రాక్షసుల ఇళ్ళన్నీ తిరిగాడు. ప్రహస్తుడి భవనానికి నిప్పు అంటించి, మహాపార్శ్వుడి

ఇంటి పైకి దూకాడు. ఆ ఇంటిని దేదీప్య మానంగా అంటించి, తరవాత వరుసగా వజ్రదంష్ట్ర, శుక, సారణుల గృహాలకు నిప్పు పెట్టేశాడు. తరువాత ఇంద్రజిత్తు, జంబు మాలి, సుమాలిల ఇళ్ళన్నీ అంటించాడు. అతను ఒక్క విభీషణుడి ఇల్లు తప్ప మిగిలిన రాక్షసోత్తముల ఇళ్ళను, మణులతో సహా తగలబెట్టేశాడు. లంక కంతా చిచ్చుపెట్టే హనుమంతుడికి సహాయంగా వాయుదేవుడు వీచాడు. వాయువు సహాయంతో లంక అంతా వేగంగా అంటుకున్నది. ఒక్కొక్క మేడగా కూలి పడసాగింది.

మండిపోతున్న తమ ఇళ్ళను రక్షించు కోవటం రాక్షసులకు సాధ్యం కాలేదు. మగ వాళ్ళూ, పిల్లలూ, స్త్రీలూ బీభత్సంలో మునిగి పోయారు. ఎంతోమంది మంటలలో నశిం చారు. తగలబడిపోతున్న లంక భయం కరంగా కనబడింది. రాక్షసుల ఆర్తనాదాలు ఈ దృశ్యాన్ని మరింత భయానకం చేశాయి.

హనుమంతుడు ఒక్కసారి లంక అంతా కలయజూసి, ఆ నగరంలోని అన్ని ప్రాంతాలూ తగలబడిపోతూ ఉండటం గమనించి, తన తోకలోని మంటలను సముద్రంలో ముంచి ఆర్పేశాడు.

ఆ సమయంలో అతనికి పెద్ద భయం పట్టుకున్నది. లంకతో బాటు సీత కూడా తగలబడిపోయి ఉంటుంది! ఈ ఆలోచన రాగానే హనుమంతుడు తనను తాను తిట్టు కున్నాడు; ఆగ్రహం చెందిన వాడికి కార్యా కార్య విచక్షణ లేకుండా పోతుందనుకున్నాడు; తాను వచ్చినపని అంతా మంట కలిసి పోయిం దనుకున్నాడు.

కాని అంతలోనే అతనికి మళ్ళీ ధైర్యం వచ్చింది. తాను వచ్చిన పని ఇన్ని విధాల సఫలమైన తరువాత సీత చావటం జరగదు. తన తోకనే కాల్చని అగ్నిహోత్రుడు సీతను దహిస్తాడా? అలా ఎన్నటికీ జరగదు. సీతే అగ్నిలాటిది! ఆమెను అగ్ని ఏం చెయ్య గలడు? అతనలా అనుకుంటూండగానే ఆకాశాన చారణులు అనుకునే మాటలు వినిపించాయి. లంక అంతా దగ్ధమైనా సీతకు ఏ అపాయమూ కలగక పోవడం గురించి వారు ఆశ్చర్యంగా చెప్పుకునే మాటలు విని హనుమంతుడు పరమానందం చెందాడు.





# గుణపాఠం

వడ్రంగి సాంబయ్యకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు శివరాముడు నగరంలో వర్తకుల కింద పనిచేస్తున్నాడు. రెండోవాడు గోవిందుడు తండ్రిలాగే వడ్రంగం నేర్చుకుని, ఇంటి దగ్గిరేవుండి తండ్రికి సహాయం చేస్తున్నాడు.

గోవిందుడు అన్నను చూడటానికి నగరం వెళ్ళిన సమయంలో సాంబయ్యకు గుండె పోటు వచ్చింది. గోవిందుడు తిరిగి వచ్చేదాకా తాను బతకననిపించి, సాంబయ్య తన పొరుగున ఉన్న గొప్ప షావుకారు భూషయ్యను పిలిపించి, అతనికి ఒక సంచీ ఇస్తూ, ''ఇందులో అయిదు వేల రూకలున్నాయి. వీటిని నా కొడుకులకు ఇచ్చి, దీని మూలంగా వాళ్ళు సోమరులైపోకుండా, సుఖంగా బతికేటట్టు మీరు చూడాలి,'' అని వేడుకున్నాడు.

భూషయ్య ఒప్పుకుని ఆ డబ్బు సంచీ తీసుకుని తన ఇంట్లో పెట్టి, మళ్ళీ వచ్చే సరికి, సాంబయ్య ప్రాణం పోనే పోయింది. వెంటనే నగరంలో ఉన్న సాంబయ్య కొడుకులకు కబురు వెళ్ళింది. వాళ్ళు వచ్చి తండ్రికి ఉత్తరక్రియలు చేశారు. వాళ్ళకు అలమారులో తండ్రి రాసిపెట్టిన చీటీ ఒకటి కనబడింది. భూషయ్యకు కబురుపెట్టక ముందే సాంబయ్య తన కొడుకుల పేర ఒక చీటీ రాసి పెట్టి, దాన్ని అలమారులో ఉంచాడు.

''నేను చాలా కాలంగా పోగు చేసిన డబ్బు అయిదు వేలు ఉన్నది. దాన్ని షావుకారు భూషయ్యగారికి ఇస్తాను. మీరు ఆయన సలహా ప్రకారం దాన్ని వినియోగించుకుని, సోమరులు కాకుండా సుఖంగా బతకండి,'' అని ఆ చీటీలో ఉన్నది.

సాంబయ్య కొడుకులు ఆ చీటీని తీసుకుపోయి భూషయ్యకు చూపితే, భూషయ్య ఎంతో నొచ్చుకున్నట్టు నటిస్తూ, ''పాపం, మీ

25-ఏళ్ళనాటి చందమామ కథ



సాంబయ్య కొడుకులు భూషయ్యకు గుణపాఠం నేర్పటానికి నిశ్చయించుకుని, అందుకు ఒక పథకం వేసుకుని, భూషయ్య మాటలు నమ్మినట్టుగా నటించారు.

శివరాముడు భూషయ్య వద్దకు వెళ్ళి, ‘‘మా నాన్న పోతూ పోతూ మిమ్మల్ని చూపాడు. ఇప్పుడు మీరే మాకు పెద్ద దిక్కు. మా గోవిందుడు వడ్రంగం చేసుకుంటూ ఇక్కడే ఉంటానంటున్నాడు. వాణ్ణి ఒంటరిగా విడిచిపోలేను. నాకు కూడా ఇక్కడే పొట్టపోసుకునే మార్గం ఏదన్నా చూపండి,’’ అని అడిగాడు.

‘‘మా ఇంటి జమా ఖర్చులు చూస్తూ నా దగ్గిరే పని చెయ్యి. ఆ మాత్రం సహాయం చెయ్యలేనా?’’ అన్నాడు భూషయ్య.

నాయన నాకు డబ్బు ఇద్దామనుకున్నాడు కాబోలు! కాని ఇచ్చేలోపునే మృత్యువు పిలుచుకుపోయింది! ఇల్లంతా జాగ్రత్తగా వెతకండి,’’ అని సలహా ఇచ్చాడు.

మోసం తలపెట్టి, భూషయ్య అబద్ధం ఆడుతున్నాడని సాంబయ్య కొడుకులు తెలుసుకున్నారు. ఎందుకంటే సాంబయ్య చావక ముందే ఒకసారి భూషయ్య వచ్చి, సాంబయ్యతో ఏదో రహస్యంగా మాట్లాడి వెళ్ళినట్టూ, రెండోసారి భూషయ్య వచ్చినప్పుడు మాత్రం సాంబయ్య చనిపోయి ఉన్నట్టూ వాళ్ళకు తెలిసింది. సాంబయ్య భూషయ్యకు డబ్బు ఇచ్చే ముందు చీటీ రాసి ఉండవచ్చుగాని, చచ్చే ముందు డబ్బు ఇచ్చాడనటానికి సందేహం లేదు. ఇంట్లో ఎక్కడా అంత పెద్ద మొత్తం కనబడలేదు.

శివరాముడు భూషయ్య ఇంట చేరి, ఇంట్లో అందరి విశ్వాసానికీ పాత్రుడయ్యే విధంగా నడుచుకుంటూ, వాళ్ళ కుటుంబంలో మనిషిలాగా అయిపోయాడు. అతనికి ఆ ఇంటి గుట్టుమట్లు అన్నీ తెలిసిపోయాయి.

భూషయ్య తన డబ్బు యావత్తూ ఒక భోషాణం పెట్టెలో పెట్టి, దాన్ని నలుగురూ తిరిగే నట్టింటనే ఉంచి, అందులో పాత బట్టలూ, ఇతర విలువలేని వస్తువులూ తప్ప ఇంకేమీ లేనట్టు దాని మీద ఒక పాత బట్ట కప్పి ఉంచేవాడు. అయితే ఇంటి వారిలో ఎవరో ఒకరు అస్తమానమూ ఆ భోషాణాన్ని ఒక కంట కనిపెట్టే ఉండేవారు.

శివరాముడు అవకాశం దొరికినప్పుడు ఆ భోషాణం పెట్టె కొలతలు రాసి పెట్టుకున్నాడు.



ఒకనాటి రాత్రి భూషయ్య ఇంటి తలుపు ఎవరో తట్టారు. భూషయ్య నిద్రకళ్ళతో లేచి తలుపు తీశాడు. బయట ఎవరో రాజకుమారుడిలాగా బట్టలు వేసుకుని ఉన్నాడు. అతని వెనక చీకట్లో కొందరు మనుషులున్నారు.

రాజకుమారుడు భూషయ్యకు నమస్కరించి, ''ఈ ప్రాంతంలో మిమ్మల్ని మించిన ధనికుడు లేడని విన్నాం. మాది పొరుగు రాజ్యం. అకస్మాత్తుగా మాకు ఆపద వచ్చి పడింది. నేను కొంత సొత్తు దక్కించుకుని బయటపడ్డాను. నా ధనమంతా ఈ పెట్టెలో ఉన్నది. దాన్ని మీ వద్ద దయ ఉంచి భద్రపరిచినట్టయితే, మంచి రోజు రాగానే నేనే వచ్చి పట్టుకుపోతాను. మీరు ఈ సహాయం చేసినట్టయితే, మీ ఉపకారం మరిచిపోను,'' అన్నాడు.

అప్పుడుగాని భూషయ్య పెట్టెను చూడలేదు. అది బయటి అరుగు మీద పెట్టి ఉన్నది. దాని మీద మఖ్మల్ గుడ్డ కప్పి ఉండటంచేత చీకట్లో కలిసిపోయింది.

భూషయ్య పెట్టెను తన ఇంట ఉంచుకోవటానికి ఒప్పుకున్న మీదట రాజకుమారుడి మనుషులు ఆ పెట్టెను లోపలికి తెచ్చారు. అది కూడా భోషాణం పెట్టే. భూషయ్య తన పెట్టెను జరిపి, చోటు చేసి, రాజకుమారుడి పెట్టెను తన భోషాణం పెట్టె పక్కనే పెట్టించాడు.

రాజకుమారుడు సెలవు పుచ్చుకుని తన మనుషులతో వెళ్ళిపోయాడు. భూషయ్య తన అదృష్టాన్ని తలుచుకుని మురిసిపోతూ పడుకున్నాడు. ఈ రాజకుమారుడికి మంచి రోజులు రాకపోతే ఆ పెట్టె తనదే! ఒక వేళ మంచి రోజులు వస్తే, తనకు జీవితాంతమూ ఆ రాజకుమారుడి అండ ఉంటుంది! ఇలా అనుకుంటూ భూషయ్య సంతోషంగా నిద్రలోకి జారుకున్నాడు.

తరవాత కొద్ది సేపటికి రాజకుమారుడి పెట్టె మీద ఉండిన మఖ్మల్ గుడ్డ జారి కింద పడింది. దాని తలుపు పైకి లేచింది. అందులో నుంచి గోవిందుడు పైకి వచ్చాడు. వాడు మళ్ళీ ఆ పెట్టెను మూసి, భూషయ్య పెట్టె మీది పాతగుడ్డ దాని మీద కప్పి, తన పెట్టె మీద ఉండిన మఖ్మల్ గుడ్డను భూషయ్య పెట్టె మీద కప్పి, నిశ్శబ్దంగా దొడ్డి తలుపు తెరుచుకుని వెళ్ళిపోయాడు.

భూషయ్య మంచి గాఢనిద్రలో ఉండగా ఎవరో కొట్టి లేపారు. భూషయ్య ఉలిక్కిపడి లేచి కూర్చుని, తన మంచం పక్కన ఎవడో సాయుధభటుడిలాటి వాడు ఉండటం చూసి కంగారుపడుతూ, ''ఎవరు మీరు? లోపలికి ఎలా వచ్చారు?'' అని అడిగాడు.

భటుడు పరుషంగా, ''నేను ప్రశ్నలడుగుతాను. నువ్వు చెప్పు! పొరుగు రాజు కొంత సేపటి కింద మీ ఇంటికి వచ్చి, రెండు పెట్టెలు మీ ఇంట దాచినట్టు తెలిసింది. వాణ్ణి వెతికి పట్టుకోమని కొత్త రాజుగారి ఆజ్ఞ,'' అన్నాడు.

''ఆ రాజు అప్పుడే వెళ్ళిపోయాడు. మా ఇంట ఏదో పెట్టె ఉంచాడు. అందులో ఏమున్నదో నాకు తెలీదు. కావలిస్తే ఆ పెట్టె తీసుకుపో, బాబూ!'' అన్నాడు అతను.

భటుడు పక్కపక్కనే ఉన్న రెండు భోషాణం పెట్టెలూ చూసి, ''ఈ రెండూ వాడివే!'' అన్నాడు.

అందులో సాదాబట్ట కప్పినది తనదనీ, మఖ్మల్‌బట్ట కప్పినది మాత్రమే ఆ రాజుదనీ భూషయ్య ప్రమాణాలు చేసిన మీదట భటుడు, ''సరే, పెద్దమనిషివని నీ మాట నమ్ముతున్నాను,'' అంటూ కేకపెట్టి మనుషులను లోపలికి పిలిచి, మఖ్మల్ బట్ట కప్పి ఉన్న భోషాణం పెట్టెను పట్టించుకుపోయాడు.

ఆ పెట్టెలోనే భూషయ్య డబ్బంతా ఉన్నది. చాలా సేపటికి భూషయ్య తేరుకుని, పెద్ద ఆపద తప్పిందనుకుంటూ, పాతగుడ్డ తొలగించి, భటుడు వదిలి పోయిన భోషాణం పెట్టె మూత ఎత్తాడు. అందులో ఏమీ లేదు.

డబ్బంతా పోయినందుకు తెల్లవారిన దాకా ఇంటిల్లిపాదీ శోకాలు పెట్టారు. తెల్లవారి శివరాముడు వచ్చి, జరిగిన సంగతి విని, తాను కూడా శోకాలు పెట్టి, ''ఇంక నేను మీ ఇంటి జమా ఖర్చులు ఏం చూసేది? ఉన్నదంతా ఖర్చే అయిపోయింది!'' అని కళ్ళు తుడుచుకుంటూ సెలవు పుచ్చుకున్నాడు.

తరవాత కొద్ది రోజులకే సాంబయ్య రహస్యంగా దాచిన డబ్బు కొడుకులకు దొరికిందని ఊళ్ళో పుకారు లేచింది. శివరాముడు ఆ డబ్బుతో వర్తకం మొదలుపెట్టాడు కూడా.





# విహంగభేరి

ఒకానొకప్పుడు తూరుపు సముద్రం మధ్యన గంభీరగిరి అనే మహాపర్వతం ఉండేది. ఆకాశాన్నంటుతున్నట్టు కనిపించే గంభీరగిరి ఒక వైపున రకరకాల మధుర ఫలవృక్షాలు, పరిమళాలు వెదజల్లే పుష్పవనాలు ఉండేవి. అందువల్ల రకరకాల పక్షులు ఆ పర్వతం మీద నివసించేవి. వాటిలో ముఖ్యమైనవి గండభేరుండ పక్షులు. ఆ పక్షిజాతికి విహంగ భేరి అనే గండభేరుండం రాజుగా ఉండేది. విహంగభేరి చాలా బలమైనది. అంతకన్నా మించిన మంచి మనసు కలది. అందువల్ల విహంగభేరి రక్షణలో తక్కిన పక్షులు ఎలాంటి కొరతా లేకుండా సంతోషంగా కాలం గడుపుతూ ఉండేవి.

ఆ పక్షులకు హఠాత్తుగా ఒక సమస్య ఎదురయింది. గంభీరగిరిని తనలో కలుపుకోవాలనే ఆరాటం కొద్దీ సముద్రం పెద్ద పెద్ద అలలతో కొండరాళ్ళను ఢీకొన సాగింది. సముద్రం చేస్తున్న ప్రయత్నం గ్రహించిన గంభీరగిరి అలలు తనను తాకి అణుమాత్రం కదిలించలేక వెనుదిరిగినప్పుడు పరిహాసంగా నవ్వేది. దాంతో సముద్రం ఆగ్రహం మరింత పెరిగేది. ఆ విధంగా పర్వత, సాగరాల మధ్య వైరం ఏర్పడింది. గంభీరగిరిని ముక్కలు చెయ్యాలన్న పట్టుదలతో సముద్రం జరిపే అలల తాకిడికి భయంకరమైన శబ్దం ఉత్పన్నమయ్యేది. ఆ శబ్దం పక్షుల ప్రశాంతతకు భంగం కలిగించేది.

ఇలా ఉండగా ఒకనాడు ఆకాశరాజు కుమార్తె మేఘమాల గగన విహారం చేస్తూ గంభీరగిరి అందచందాలు చూసి ఆ పర్వతం మీద కాలు మోపింది. దానిని గమనించిన పక్షిరాజు విహంగభేరి, ''ఆకాశ రాజకుమారికి స్వాగతం. మా ఆతిథ్యం స్వీకరించి ఇక్కడి

ఎన్ శివనాగేశ్వరరావు



ప్రకృతి శోభను తిలకించు. అందుకు తగిన ఏర్పాట్లు నేను చేస్తాను,'' అంటూ సాదరంగా స్వాగతం పలికింది.

విహంగభేరి వినయశీలతకు ముగ్ధురాలైన మేఘమాల, దాని కోరిక మన్నించి పక్షుల ఆతిథ్యం స్వీకరించింది. విహంగభేరి సుమధుర ఫలాలను, సుగంధ పుష్పమాలికలను తెచ్చి మేఘమాలకు సమర్పించింది. ఆమెను తన వీపుపై కూర్చోబెట్టుకుని వందలాది పక్షులు వెంటరాగా వెళ్ళి గంభీరగిరి సహజ సౌందర్య ప్రదేశాలను, సుందర వనాల సొబగులను చూపించింది. మణిమాణిక్యాలను కానుకలుగా ఇచ్చి ఆప్యాయతతో వీడ్కోలు పలికింది. పక్షిజాతి ఆతిథ్యానికి ఎంతగానో సంతోషిస్తూ మేఘమాల స్వస్థలానికి బయలు దేరింది.

మేఘమాల ద్వారా విహంగభేరి ఆతిథ్యం గురించి విన్న ఆకాశరాజు పరమానందం చెందాడు. మరునాడే విహంగభేరిని చూడ వచ్చి, ''నాకు అత్యంత ప్రీతిపాత్రమైన నా గారాలపట్టి మేఘమాలను నువ్వు సంతోష పరిచావు. అందుకు ప్రతిగా ఏదైనా వరం కోరుకో ఇస్తాను,'' అన్నాడు.

అందుకు విహంగభేరి, ''నేను ఎలాంటి ప్రతిఫలమూ ఆశించి తమ కుమార్తెకు ఆతిథ్యం ఇవ్వలేదు. అది హృదయపూర్వకంగా ఇచ్చినది. దయచేసి దానికి విలువ కట్టకండి,'' అన్నది.

''సరే. నా మనసుకు ఆనందం కలిగించడానికైనా ఏదైనా వరం కోరుకో. కాదనకు,'' అన్నాడు ఆకాశరాజు.

అప్పుడు విహంగభేరి, ''ఇంతగా అడుగుతున్నావు గనక ఒక విన్నపం. భగవంతుడి దయవల్ల మా పక్షి జాతికి ఈ పర్వతం మీద ఎలాంటి కొరతా లేదు. అయితే సముద్రానికీ, గంభీరగిరికీ మధ్య ఉన్న వైరం వల్ల మా ప్రశాంతతకు భంగం వాటిల్లుతున్నది. సముద్రుడు తన బలమైన అలలతో గంభీరగిరిని బద్దలు కొట్టే ప్రయత్నం చేసిన ప్రతిసారీ ఉత్పన్నమయ్యే భీకరశబ్దం మాకు అలజడి కలిగిస్తున్నది. ప్రశాంతి లేకుండా పోయింది. ఈ సమస్యను తీరిస్తే మా పక్షిజాతి నీకెంతో రుణపడి ఉంటుంది,'' అన్నది.

అదివిన్న ఆకాశరాజు, ''పక్షిరాజా! నేను నీకు ఇచ్చిన వరాన్ని నువ్వు నీకోసం కాకుండా, పరులకోసం కోరావు. మహోన్నత వ్యక్తిత్వం

నీది. నీ కోరిక తప్పకనెరవేరుస్తాను,'' అంటూ అదృశ్యమయ్యాడు.

ఒకవెన్నెలరాత్రి గండభేరుండాలన్నీ కలిసి కులాసాగా కబుర్లాడుతూ, చెట్ల మీద చేరి కునుకు తీయబోతూండగా వాటి చెవులకు ఇంపైన సంగీతం వినవచ్చింది. ఆ సంగీతం విని పక్షులు ఆశ్చర్యపోయాయి. ఇన్నాళ్ళు సముద్రం అలలతాకిడికి లేచే భీకరనాదాలే తప్ప ఇంతటి మధురమైన సంగీతం విని ఎరుగవు. ఆ సంగీతం విన్న విహంగభేరి ఆశ్చర్య పోతూ, ''ఆ సంగీతం ఎక్కడి నుంచి వస్తున్నదో చూడాలి,'' అంటూ బలమైన రెక్కలు విదిలించి గాలిలోకి లేచింది. మరికొన్ని పక్షులు దానిని అనుసరించి వెళ్ళాయి.

కొంతదూరం పైకెగిరిన విహంగభేరి తన దృష్టిని కిందికి సారించింది. మహాసముద్రం అలలు గంభీరగిరిని తాకిన చోట భీకర శబ్దానికి బదులు సుమధుర సంగీతం వెలువడు తున్నది.

ఇదంతా ఆకాశరాజు వర ప్రభావం అని విహంగభేరి గ్రహించి మనసులోనే కృతజ్ఞతలు తెలియజేసింది. ఆకాశరాజు అలలు తాకే శిలల ఆకృతిని వీనులకు ఇంపయిన ధ్వనులు పుట్టడానికి అనువుగా మార్చి, పంచ భూతాలలో వాయువు అంశ అయిన శబ్దాన్ని వాటిలో నిక్షిప్తం చేశాడు. దాంతో అలలు తాకినప్పుడు సుమధుర సంగీత తరంగాలు వెలువడుతున్నాయి!

భీకర శబ్దాల బాధ తప్పినందుకు కారణ భూతమైన తమ రాజును పక్షులు అభినందించాయి.

గంభీరగిరి తన అలల ఉధృతిని తట్టుకోలేక జడుసుకుని మెత్తబడి తనను మంచి చేసుకోవడానికే మధురసంగీతం పుట్టిస్తోందని భావించి సముద్రం అలల తాకిడిని తగ్గించింది!

సముద్రం ఇన్నాళ్ళు అహోరాత్రులు ఎంతగానో పోరాడినప్పటికీ తననేం చేయలేకే ఇప్పుడు సంధికోసం అలలతో సంగీతం సృష్టించి వినిపిస్తోందని గంభీరగిరి భావించి మురిసిపోయింది!

ఆ విధంగా పర్వతసాగరాల మధ్య విరోధం సమసిపోయి సఖ్యత ఏర్పడింది.



# అసలైన గుడ్డివాడు!

రాయవరం జమీందారు జగపతిరాయుడికి ఎదుటివారిని ఏడిపించి ఆనందించడం అంటే మహా సరదా. ఒకనాడాయన శివాలయానికివెళ్ళి, దైవదర్శనం చేసుకుని వెలుపలికి వచ్చాడు. ఆలయం ఎదుట ఒక ముష్టివాడు, ''ధర్మం చెయ్యండి బాబూ, దేవుడు మిమ్మల్ని చల్లగా చూస్తాడు,'' అంటూ అడుక్కుంటున్నాడు. వాడు పుట్టుగుడ్డివాడు.

రాయుడికి వాణ్ణి చూడగానే ఏడిపించాలనిపించింది. చుట్టుపక్కల చూసి ఒక చిన్న రాయిని తీసి బిచ్చగాడి సత్తుపాత్రలో వేశాడు. వెంటనే వాడు, ''ఎవరు బాబూ, రాయిని వేసింది? నాకు కళ్ళు లేకపోయినా డబ్బేదో, రాయేదో గ్రహించగలను. నీకు కళ్ళుండీ అంతమాత్రం తెలుసుకోలేకపోయావు. అసలైన గుడ్డివాడివి నువ్వే!'' అన్నాడు.

రాయుడి వెనక వచ్చిన సేవకుడు, ''ఆయన ఎవరనుకున్నావు? మన జమీందారుగారు!'' అని హెచ్చరించాడు.

''పాత్రలో పడ్డ శబ్దాన్ని బట్టి చెప్పానుగాని, ఆయన జమీందారుగారని నాకేం తెలుసు? పుట్టుగుడ్డిని! అయినా అంత పెద్ద మనిషికి ఇదేం బుద్ధి,'' అని నొచ్చుకున్నాడు ముష్టివాడు.

ఆ మాటతో జమీందారు సిగ్గుతో తలదించుకున్నాడు. ఆ రోజు నుంచి ఎదుటివారిని ఏడిపించడం మానుకున్నాడు.

–ఎ.ఎస్. జైకిరణ్



# చందమామ క్విజ్ - 10

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

Co-sponsored by Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మన దేశంలో పండుగలు తరచూ వస్తూ ఉంటాయి. ఈ నెల క్విజ్‌లో కొన్ని పండుగల గురించి తెలుసుకుందాం.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ క్విజ్ - 10 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. నవంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. జనవరి 2009 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. ఈ మాసం ప్రత్యేక అంశం 30 రోజులూ ఉపవాసం ఉండడం. కొందరు భక్తులు మరో దేశంలో ఉన్న పవిత్ర ప్రదేశానికి యాత్ర చేస్తారు. ఈ పవిత్ర మాసం ఏది? భక్తులు యాత్ర చేసే స్థలం ఏది?
2. పైన వేలాడే ఉట్టిలోని పెరుగు దుత్తను అందుకోవడానికి ఆనందోత్సాహాలతో వీధుల్లో మనుషుల మీద మనుషులు దొంతరులుగా ఏ పండుగ రోజున నిలబడతారు?
3. ఆ పండుగలో స్త్రీలు మాత్రమే పాల్గొంటారు. పాటలు పాడుతూ ఉయ్యాలలూగుతారు. ఆ పండుగ పేరేమిటి?
4. నూతన సంవత్సరారంభం సందర్భంగా మంచి ఆలోచనలతో, మంచి మాటలతో, మంచే చేయాలని కొందరు ప్రమాణం చేస్తారు. వారెవరు? ఆ రోజును ఏమని పిలుస్తారు?

# వార్తలలో బాలలు

## ఈ 'తార' పాదాలు నేలమీదే!



సుప్రసిద్ధ చలన చిత్రం 'తారే జమీన్ పర్'లో నటించిన పన్నెండేళ్ళ దర్శీల్ సఫారీ తన అద్భుతమైన నటనతో సంచలనం సృష్టించాడు. మన దేశంలో బాలలు మూగ పాత్రల్లో నటించడం కొత్తేమీ కాదు. కాని వేగంగా మారుతూన్న ఈ ప్రపంచంలో తనదైన స్థానంకోసం పోరాడే మాటాడలేని ఒక బాలుడి పాత్రలో అతడు అబ్బుర పరచే విధంగా నటించాడు. కథారచయిత అమోల్ గుప్తే అతణ్ణి షియామక్ దావార్స్ డ్యాన్స్ స్కూల్ నుంచి ఎంపిక చేశాడు. దర్శీల్ పోషించిన అల్లరి చేస్తూ అదే సమయంలో బలహీనంగా కనిపించే ఉండే ఈషాన్ అవస్తీ పాత్ర మననుంచి సానుభూతిని కోరుకోదు; నోరులేని బిడ్డకు ఇవ్వవలసిన గౌరవ ప్రదమైన స్థానాన్ని ఇవ్వాలని మన హృదయాలను కదిలించి మరీ చెబుతుంది. తారే జమీన్ పర్ చిత్రం విద్యావేత్తలను, తల్లి దండ్రులను ఒక్క కుదుపు కుదిపి అందరికీ ఒకేలా బోధించే ప్రస్తుత మూస విద్యావిధానం గురించి పునరాలోచించేలా చేసింది!

## చిన్ని ఉపాధ్యాయిని – పెద్ద పాఠం

పన్నెండేళ్ళ ఒమేగా చెన్నయ్ పెరంబూరు సెయింట్ అనీస్ స్కూల్లో చదువుకుంటోంది. ఆమె తను ఉంటూన్న వ్యాసర్‌పాడి హౌసింగ్ బోర్డ్ కాలనీలోని పదికి పది అడుగులు వైశాల్యం గల గదిలో పిల్లలకు పాఠాలు చెబుతోంది. చదువు పట్ల, క్రీడల పట్ల అమిత ఆసక్తి కనబరచే ఒమేగా ఆ ప్రాంతంలోని పద్దెనిమిది మంది పిల్లలకు వేసవి నెలవుల్లో మధ్యాహ్నం పూట తరగతులు నిర్వహిస్తోంది. మామూలు పాఠాలతో పాటు కాలూపుతూ పాటలు పాడటం కూడా నేర్పుతుంది. ఈమె పెరిగి పెద్దయ్యాక సంఘ సేవకురాలు కావాలని ఆశిస్తోంది. ఆమె తల్లిదండ్రులు, అక్కయ్య ఆమెను గురించి గర్వంగా చెప్పుకుంటున్నారు. వేసవి తరగతులు నిర్వహించడానికి కావలసిన వస్తువులను, సరంజామాను 'ఎయిడ్ ఇండియా' సంస్థ సమకూరుస్తోంది. వాటిని తమ విద్యార్థులతో పంచుకోవడానికి ఒమేగా ఎంతో సంబర పడుతోంది!



# Amazing Big Chandamama Dhamaka

Chandamama Gives You

# More!

**This November 2008, Chandamama issue + CD contains:**

72 pages of VIBGYOR- all yours!
12 archival issues of Chandamama English
Story of Krishna with fabulous illustrations
Trailer of Ramaa- the Saviour- an action movie

All for Rs ~~500~~/- Rs. 25/- only!

Rs.25/- only

Watch out for **More!** in the December Issue.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని
వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.


KALANIKETAN BALU


KALANIKETAN BALU



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా
మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జనవరి 2009 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, జెవిఎల్ ప్లాజా 6వ అంతస్తు, 626, అన్నాసాలై,
తేనాంపేట, చెన్నయ్ - 600 018

## అభినందనలు

సెప్టెంబర్ నెల
పోటీ ఫలితాలు
ఓరుగంటి మురళీధర్
ప్లాట్ నం. 246, సంతోష్‌నగర్
కర్నూలు - 518 003
(ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో: ఆడుకోను ఎవరూ లేరు!
రెండవ ఫోటో : తోడురానా నీతో నేను!!

## సమాధానాలు :

1. డీ అల్మీడా 2. కేప్టన్ హాకిన్స్ 3. అశోక చక్రవర్తి; మహేంద్రుడు, సంఘమిత్ర
4. నాదిర్ షా 5. తైమూర్ లాంగ్ 6. జజీయా 7. లార్డ్ లూయిా మౌంట్‌బాటన్
8. బహదూర్ షా జాఫర్ 9. 1288లో, రెండవ సారి 1293లో 10. రజీయా సుల్తానా

**Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited,** JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. **Editor : B. Viswanatha Reddi (Viswam)**



# నిదానం-నిలకడ గెలుపుకు ప్రధానం

గోపీనాథ్ కొత్తగా కొన్న స్టైలైన కారులో కేతన్‌ను తీసుకు వెళుతూ, ''కారును ఎంత వేగంగా నడుపగలనో తెలుసా?'' అన్నాడు యాక్సిలరేటర్ మీద బలంగా కాలు మోపుతూ.

''అలా చేయకండి అంకుల్, గంటకు డెబ్బై కి.మీ. వేగంతో నడిపారంటే 20 శాతం పెట్రోలు పొదుపు చేయవచ్చు. గంటకు 40-50 కి.మీ. వేగంతో నిలకడగా నడిపారంటే మరెంతో ఇంధనం, డబ్బు ఆదా చేయవచ్చు,'' అన్నాడు కేతన్.

''అలాగా! కార్ల గురించి నీకు బాగా తెలుసులాగుందే! ఇంకా ఏమేం తెలుసో చెప్పు వింటాను,'' అన్నాడు గోపీనాథ్.

''మా స్కూల్లో ఇంధనం రక్షణ గురించి ఉపన్యాసాలు ఏర్పాటు చేస్తారు. వాటి ద్వారా చాలా విషయాలు నేర్చుకున్నాను. ట్రాఫిక్ సిగ్నల్స్ వద్ద 15 సెకనుల కన్నా ఎక్కువ సేపు ఆగవలసి వచ్చినప్పుడు ఇంజన్‌ను స్విచ్ ఆఫ్ చేయడం ద్వారా కొంత పెట్రోలు బిల్లును తగ్గించడంతో పాటు వాయుకాలుష్యం పెరగకుండా చూసుకోవచ్చన్న విషయం మీకు తెలుసా?'' అని అడిగాడు కేతన్.

''నువ్వు ఫైనాన్స్ మేనేజర్‌వి కావలసిన వాడివి కేతన్,'' అంటూ నవ్వాడు గోపీనాథ్.

''కారును వేగంగా నడిపేప్పుడు బ్రేకులు ఎక్కువ సార్లు ఉపయోగించవలసి ఉంటుంది. ఆగి ఆగి వెళ్ళడం వల్ల ఎక్కువ ఇంధనం వృథా అవుతుంది. అందువల్ల స్టాపులు రాగలవన్నప్పుడు తక్కువ వేగంతో నడిపితే ఇంధనాన్ని పొదుపు చేయవచ్చు,'' అన్నాడు కేతన్.

''వేగంగా నడపలేనప్పుడు ఇలాంటి కారును కొనడం ఎందుకు మరి?'' అని అడిగాడు గోపీనాథ్.

''అది నిజమే అంకుల్. అయినా ఇంధనం లేకపోతే. అసలు కారును నడపలేంకదా? ఇంధనాన్ని పొదుపు చేసి కాపాడుకోలేకపోతే మునుముందు ఇంధనం లేకుండా పోయే పరిస్థితి ఏర్పడవచ్చు. అది కూడా ఆలోచించాలి కదా!'' అన్నాడు కేతన్.

''నిజమే. నువ్వు చెప్పిన టిప్స్ అనుసరిస్తే చాలా ఇంధనం, డబ్బు ఆదా చేయవచ్చు,'' అన్నాడు గోపీనాథ్.

''అవును. విషయాన్ని మీ స్నేహితులకు చెప్పండి. ఈ సింపుల్ టిప్స్ జ్ఞాపకం ఉంచుకుని వాహనాలు నడిపితే భవిష్యత్తులో ఇంధన సంక్షోభం రాకుండా చూసుకోవచ్చు,'' అన్నాడు కేతన్ నవ్వుతూ.

Save Fuel
Save Money

Dear Children,
Write your suggestions on "How to Save Fuel and Money while Driving" and send it to PCRA address given alongside & win attractive prizes!

Name............................................

Age............................Class................

Address............................................

............................................

E-mail............................................

MINISTRY OF PETROLEUM AND NATURAL GAS

PCRA PETROLEUM CONSERVATION RESEARCH ASSOCIATION

Additional Director (EC),
Sanrakshan Bhawan, 10, Bhikaiji Cama Place,
New Delhi 110066.
E-mail : pcra@pcra.org

CHANDAMAMA (Telugu) November 2008 Registrar of Newspapers of India No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08





# బుబ్బా సాహసాలు




బడి పిల్లలు అక్వేరియం దగ్గర చేరారు. వాళ్ళ టీచర్ వివరణ ఇస్తోంది.




ఒక కుర్రాడు దూరంగా నిలబడ్డాడు.




అప్పుడే వాళ్ళ వెనకనున్న గ్లాస్ కేస్‌ను ఎవరో తట్టడం వినిపించింది.




టీచరూ, పిల్లలూ వెనక్కు తిరిగి చూశారు.




బుబ్బా గుప్పెడు బబుల్‌గమ్స్ తీసి ఇచ్చాడు.




పిల్లలు చేపల సంగతి మరిచిపోయి బబుల్‌గమ్స్ పిండడం మొదలు పెట్టారు.







పిల్లలు డాల్ఫిన్స్‌తో కలిసి ఈద సాగారు!




బుబ్బాలూ బబుల్‌గమ్ జ్యూసీ మస్తీ!

